## చూడండి, మీకే తెలుస్తుంది...

# సర్వోత్తమ తెలుపుకోసం టినోపాల్ !






ఫలితములను చూడండి బట్టలను ఆఖరు సారి జాడించునప్పుడు కొంచెము టినోపాల్ వేయండి అప్పుడు చూడండి బట్టలు ఎంత తెల్లగా కను మిరుమిట్లుగొలిపేలా ఉన్నాయో! టినోపాల్ ఎంత తెల్లగా చేస్తుంది! మీ చొక్కాలు చీరలు దుప్పట్లు తువ్వాళ్లు మొదలైనవి మెరుస్తూ ఉంటాయి!

దానికయే ఖర్చు? బట్టకు ఒక పైసా కూడ కాదు! టినోపాల్ ను కొనండి రెగ్యులర్ ప్యాక్ మితవ్యయ ప్యాక్ మరియు బాల్టీకి సరిపోయే పొట్లము—మూడు ప్యాకింగులలో లభిస్తుంది

® టినోపాల్ జె ఆర్ గైగి ఎస్ ఎ బాస్ల్ స్విట్జర్లెండ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

సుహృద్ గైగి లిమిటెడ్ పి ఒ బాక్స్ 11050 బొంబాయి 20 బి ఆర్

# ఉత్తరాలు

## కథలు

వలివేటి నాగచంద్రావతిగారి, 'కనువిప్పు' కథ చదివి ఈ ఉత్తరము వ్రాయలేకుండా ఉండలేక పోయినాను. కథ చాల బాగుంది. పాత్రలను రచయిత్రి అనుకోని విధముగా మనస్తత్వాలనుమార్చుతూ వచ్చినా కథ బాగా నడిచింది. యోగ్యుడైన మధు తన వదినగారి దుర్మార్గమైన గుణాలను మొదటి నుంచీ కనిపెడుతూ వచ్చి ఆఖరుకు ఆమె మాయ మాటలెలా నమ్మగాగలిడు ఇదే కొంచెము నమ్మ శక్యముకానిదిగా తోచినది. కమల వ్రాసిన ఉత్తరము చదివి దుఃఖము పొరలి వచ్చినది. ఎలాగునైనా రచయిత్రి మా కృతజ్ఞతలను దోచుకున్నారు

అల్లవరపు భీమేశ్వరరావు (మద్రాసు—9)

## కార్టూన్

19—9—1969 మీ (మా) వారపత్రికలోని, ఉత్తరాల శీర్షికలో డి. వి. ప్రసాద్‌బాబ ఉత్తరన్ని చూచి ఇంజనీర్లపై వికారమైన కార్టూన్లు ఇకముందు వెయ్యరని అనుకున్నాను. కాని తీరా ఆ పత్రికలోని పేజీలు ఒక్కొక్కటే తిరుగవేసి చూస్తే '37' వ పేజీలో మళ్లీ ఇంజినీరు విలువలు తెలియని మహాగొప్ప కార్టూనిస్టు 'శ్రీనివాస్', కార్టూను, నీచాతినీచమైన కార్టూనది. సంపాదకులు అలాంటి కార్టూన్లను చదివి పాఠకులు కడుపుబ్బ నవ్వుతున్నారని భ్రమ పడుతున్నారే కాని ఏ ఇంజనీరయిన ఆ కార్టూను చూచి మీ పత్రికను చించి వేయక మానరు. ఇది ఇంజనీర్లకు ఒక ప్రెస్టేజి కొశ్చన్. ఏ ఇంజనీరు అయినా ఎస్టిమేటు, ప్లాను చేసినందులకు 'వన్ బై టు కాఫీ' తీసుకుంటాడా! ఇంజనీరంటె అంత 'చీప్' అనా ఆ 'శ్రీనివాస్' కార్టూనిస్టు దృష్టిలో. శ్రీనివాస్ మీ (మా) పత్రిక కార్టూనిస్టు అయితే కావచ్చు. కాని అంతమాత్రాన ఇంజనీర్లతో చులకనగా చలగాటమాడటం అంత సమంజసంకాదు. ఇంజినీర్లు చాలవరకు పత్రికలోని కథలు, ఇతర విషయాలు అలా వదిలేసి తీరిక సమయాల్లో కార్టూన్లు చదివి ఆనందించటం హాబీ. ఈ విషయం పోచంపాడ.లోని ఇంజనీర్లకు, స్పెషల్‌గా నూటికి నూరు పాళ్లు వర్తిస్తుంది. అలాంటప్పుడు 'ఇంజనీరు' అన్న పదానికి విలువ తెలియక వారిపై ఇష్టం వచ్చినట్లు విలువలు కట్టి కార్టూన్లు వేయటంలో అర్థం లేదు. ఈలాంటిదే మీ పత్రిక ప్రతిష్టలు క్షీణతకు కారణభూతులు కాగలవని చెప్పటంలో తప్పు లేదనిపిస్తోంది.

మీరు ఈ ఉత్తరాన్ని ఎలాగు ప్రచురించరని నాకు బాగా తెలుసు. ఎందుకంటె మీ శ్రీనివాస్ కార్టూనిస్టు విషయంలో వ్రాసినందుకు. ప్రచురించకపోయిన ఫరవాలేదు కాని ఇకముందయిన 'అలాంటి కార్టూను వేయము' అని జవాబు ఇచ్చి, మీ పత్రిక ప్రతిష్ఠలు నిలబెట్టుతారని ఆశిస్తున్నాను.

యం. భూమయ్య (పోచంపాడు ప్రాజెక్టు పి.డి2).

## తెరపై ముద్దు

తెరపై ముద్దు కావాలా? వద్దా అనే విషయము గూర్చి తారలు వెలువరిస్తోన్న అభిప్రాయాలు చూస్తే నవ్వు వస్తుంది ముద్దు పెట్టుకోవడము బాగుండదని అది భారతీయ సంస్కృతి కాదని వారి వాదన. నిజమే కాని ఈ నాడు విడుదలవుతున్న సినిమాల్ని భారతీయ సంస్కృతికి అనుగుణముగానే ఉన్నాయా? అర్ధనగ్న క్లబ్‌నృత్యాలు పుత్తెక్కించే హీరో హీరోయిన్ల కౌగిలింతలు, ఒకరి చెంపను ఒకరు గట్టిగా రాచుకోవడము, ఇదంతా భారతీయ సంస్కృతి యేనా? వీటన్నింటిని వ్యతిరేకించనప్పుడు ఒక్క ముద్దులనే వ్యతిరేకించడము సబబుగా లేదు. తెరపై ముద్దులను అంగీకరించడములో గల ఉద్దేశ్యము ఖోస్లా కమిటీ స్పష్టముగా వివరించినది. నైతికముగా సినిమాల స్థాయిని నిలబెట్టటానికే కమిటీ ఆ నిర్ణయము చేసింది. అటువంటప్పుడు తెరపై ముద్దులను తారలు వ్యతిరేకించడములో అర్థము లేదు.

బి. రాములు, (జగిత్యాల)

### అక్షయతూణీరం

31–10–69 సంచికలో అక్షయతూణీరంగా దిగంబర కవుల గేయంతోటి వేసిన వ్యంగ్యచిత్రాలు చూస్తున్నను మన చిత్రకారుల 'ఆ కాస్త పాలికలో', 'ఆ పెరగని మెదడులోని పసరులని' సంపాదకులు చవి చూపించారు గుర్రమూ, కవి బానేఉంది బార్ బొమ్మలు, రచయితల అమర్యాదగత, వ్యక్తిగత

## ఉత్తరాలు

దూషణలు సంపాదకులే ఆమోదించినట్లు అర్థం చేసుకోవలసి వస్తుంది సంపాదకులు ప్రచారం కోసం కూసే పాసరయ్య కూతల్ని అంకిత్యం చేయాల్సింది. దిగంబర కవుల ఆవేదననీ దేశీయ బాధనీ వ్యక్తం చేసిన ముక్కల్ని ఆలోచనా దిగంబర చిత్రంగా చిత్రించారు కార్టూనిస్టు తన వ్యంగ్యం ద్వారా జ్ఞానాన్నీ, సంతోషాన్నీ పాఠకులకి అందించాలి అజ్ఞానాన్నీ, తలకడనాన్నీ పంచకూడదు

భట్టు, (మచిలీపట్నం)

### వ్యాసాలు

17–10–1969 సంచికలో ఉత్తరాలు శీర్షిక చదివి చలా బాధపడ్డాను. నేనే కాదు ఏ వ్యాక్తి అలోచించ గలవారైనా బాధపడతారు.

శ్రీ ఆరణి అప్పారావుగార (విశాఖపట్నం) గాంధీజీని బాజాపట్టిన భావాలున్నారు. మహాత్ముడు అభివృద్ధి విరోధి అనని అనుకుంటున్నారేమో? నిజానికి శ్రీ అప్పారావుగార మహాత్ముని కూలంకషంగా పరిశీలించారా? మానవుడై జన్మించి మానవాతీతుడై విరిచిపోయిన ఆ మానవోత్తముని. కరుణామయుని భావాలా బూజుపట్టినవి? ఇదా మనం గ్రహించ గలిగింది?

ఇందుమతీ ఎమ్. (హైదరాబాద్.) ●

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 28–11–'69
(శ్రీసౌమ్యనామ సం॥ మార్గశిర్ష మా॥ బహుళ పవిత)

సంపుటము : 63 సంచిక : *11*

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26 00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6 50 |


## విషయానుక్రమణిక






విభిన్న మార్గాలు
మనం ముందే కలిసి వుండ వలసింది
అభివృద్ధి
రాజకీయ అస్థిరత్వం
నన్నుగౌరవించకపోతే సత్యాగ్రహం చేస్తాను
మార్క్సిస్టులు
విచారించే ముఖ్యమంత్రి

# కాంగ్రెసులో చీలిక పర్యవసానం

ఈ లేఖరాసే ఉదయం ప్రధానమంత్రి మేడమ్ ఇందిరాగాంధిని కాంగ్రెసు పార్టీ నుంచి బహిష్కరించటం జరిగింది ఇది కాంగ్రెసు పార్టీ నాశనం మొదలయినదని చెప్పే ప్రకటన అనవచ్చు కాంగ్రెసు పార్టీ చీలిక ఇంతకిముందే మొదలయింది మియాన్ ఫక్రుద్దీన్ఆలీ అహమ్మద్, శ్రీ సి సుబ్రమణ్యంలని కార్యాచరణ సంఘం నుంచి తీసి వేసినప్పుడే చీలిక మొదలయింది మేడమ్ గాంధిగారు పోటీ కాంగ్రెసు సంఘం ఒకదానిని నడపటమే దీనికి తార్కాణం. ఈ సంఘానికి మేడమ్ గాంధిగారే అధ్యక్షత వహించారు

వారూ, వారి సహచరులూ తమ సంఘమే అధికారయుతమని ప్రకటించి అఖిలభారత కాంగ్రెసు సమావేశం ఒకటి నవంబర్ 22, 23 తేదీలలో ఢిల్లీలో జరగాలన్నారు. అధికార సంఘం వారు ఈ సమావేశం గుజరాత్‌లో డిసెంబర్‌లో జరగానున్నారు

## మేడమ్ గాంధీ ఉపాయం...

మేడమ్ గాంధిగారి ఉపాయం గురించి కొంత చెప్తాను నేటి పరిస్థితులనిబట్టి ఢిల్లీలో సుమారు 400 మంది అఖిలభారత కాంగ్రెసు సంఘం సభ్యులు హాజరు కావచ్చు ఈ సభ్యుల సమావేశంలో శ్రీ నిజలింగప్పని అధ్యక్ష పదవినుంచి తొలగించి లాలాగుల్జారీలాల్ నందాని కొత్త అధ్యక్షుడుగా ఎన్నుకొనడం జరుగుతుంది. గుజరాత్‌లో జరిగే సమావేశానికి కూడా మేడమ్‌గాంధిగారి అనుచరులు వెడదామనుకుంటున్నారు. వెళ్లి కాంగ్రెసు పార్టీ సంస్థని పూర్తిగా చేజిక్కించుకొనాలని వారి ఉద్దేశం

కాంగ్రెసులో చీలిక కొత్త సంగతి కానేకాదు ఇది 1906 లోనే మొదలయింది. సూరత్‌లో ఆ ఏడు జరిగిన సమావేశంలో మితవాదులయిన శ్రీ రేనడే, తీవ్రవాదులయిన శ్రీ బాలగంగాధరతిలక్‌ల నాయకత్వాలు కల రెండు వర్గాలు ఘర్షణపడ్డాయి. చివరికి ముష్టియుద్ధం కూడా జరిగింది ఇది జరిగిన అనతికాలంలోనే శ్రీ తిలక్ జెయిలుకి వెళ్లారు కాంగ్రెసులోని అంతర్యుద్ధంలో ఎవరికీ గెలుపు రాలేదు.

## స్వరాజ్ పార్టీ

రెండవ చీలిక 1924 గయ కాంగ్రెసు సమావేశంలో వచ్చింది. నేటి ప్రధానమంత్రి తాతగారు పండిత మోతీలాల్ నెహ్రూ, శ్రీ సి ఆర్. దాసులు కలిసి స్వరాజ్ పార్టీ పెట్టారు అప్పుడు మహాత్మాగాంధి జెయిలులో ఉన్నారు. ఆయన క్రమంగా మోతీలాల్ నెహ్రూగారిని తమ వయిపుకి తిప్పుకోగలిగారు. మహాత్మునికి కాంగ్రెసుమీద పూర్తి అధికారం ఉండేది అయినా 1938లో ఆయన అధ్యక్ష పదవికి నిలబెట్టిన అభ్యర్థిని శ్రీ సుభాష్‌చంద్రబోస్ ఓడగొట్టారు నేతాజీ అధ్యక్షతకింద జబల్పూర్ సమావేశానికి గాంధిగారు వెళ్లలేదు. ఈ సమావేశంలోనే 'పంత్ తీర్మానం' అనేది ఒకటి చెయ్యటం జరిగింది. ఈ తీర్మానాన్ని అ.భా.కాం.సం వారూ, సర్వసభ్య సమావేశం వారూకూడా ఆమోదించారు కాంగ్రెసు అధ్యక్షుడు గాంధిగారితో సంప్రదించి కార్యాచరణ సంఘాన్ని ఏర్పరచాలని ఈ తీర్మానం ఉన్నది సుభాష్ చంద్రబోస్ కాంగ్రెసుని వదిలి వెళ్లిపోవటానికి ఎక్కువ కాలం పట్టలేదు వారు తమ 'ఫార్వర్డ్ బ్లాక్'ని మొదలు పెట్టారు. కాని యుద్ధం, ఆయన భారతదేశాన్ని వదిలి వెళ్ళటం జరగటంతో ఆ అధ్యాయం ముగిసింది.

## సర్వాధికారి

గాంధిగారు బతికి ఉన్నంతకాలం కాంగ్రెసు కార్యాచరణ సంఘం సర్వాధికారాలు కల సంస్థగా ఉండేది అంతు రాష్ట్రాల మధ్య సంబంధాలు ఇక్కడే చర్చింపడం, వాటికి తగిన నిర్ణయాలు తీసుకొనడం జరిగేది.

కాంగ్రెసువంటి జాతీయసంస్థ ఈ విధంగా నాశనం అవటం ఎంతో విచారం కలిగిస్తోంది భారతదేశం నిలకడకీ, అయికమత్యానికీ చిహ్నంగా నిలచిన ఈ సంస్థ నేడు ముక్కలయి పోతోంది ఇది కమ్యూనిస్టుల సిద్ధాంతాలకి లోబడి కాకుండా మిశ్రమయిన ఆర్థిక వ్యవస్థ కోసం కృషి చేస్తూ వచ్చింది.

## నాడూ, నేడూ

గతకొన్ని నెలల చరిత్రని తిరిచి చూస్తే కాంగ్రెసు వారు ఎంత నీచానికి దిగారా, అనిపిస్తుంది నేతాజీ గాంధిగారికి దూరమయినప్పటికి ఎంతో మర్యాదగా వెళ్లిపోయారు శ్రీ జయప్రకాష్ నారాయణ నాయకత్వం కింద సోషలిస్టులు కూడా ఎంతో పెద్ద మనుషులుగా కాంగ్రెసుని వదిలి వెళ్లిపోయారు వారెవరూ తమ 'మురికిబట్టలని బజారులో ఉతుక్కో'లేదు. శాసనసభలో తగని మాటలు వాడలేదు.

## సిగ్నల్

ముష్టియుద్ధానికి సిగ్నల్ ఇవ్వటం అయింది కాంగ్రెసు అధ్యక్షుడిని ఖండించే ప్రదర్శనకి సన్నాహాలు జరుగుతున్నాయి. ఇంకా ఎన్నో జరుగుతాయి. 'మహానాయకులు' తమని గురించి ఏమనుకున్నా సరే అందరూ నవ్వుల పాలవుతున్నారు. భారతదేశంలో ప్రజాస్వామ్యానికి ఉజ్వల భవిష్యత్తు ఉందనుకునే వారు. దానిని ఇప్పుడు వేళ్లతోబాటు పెకలించి వేస్తున్నారు.

కాంగ్రెసు పార్లమెంటరీ పార్టీ సమావేశం అల్లరిగా ఉంటుంది. పార్టీలో మేడమ్ గాంధిగారికే మెజారిటీ ఉంది. ముష్టియుద్ధాలు జరగవచ్చు.

## ప్రధానమంత్రి, పార్టీ

స్వతంత్రం రాకముందు కాంగ్రెసు పార్టీ చీలికలకీ నేటి చీలికలకీ భేదం ఉంది అప్పుడు కాంగ్రెసు అధికారం లేని పార్టీ. నేటి పరిస్థితిని ప్రిన్స్‌టన్ విశ్వవిద్యాలయానికి చెందిన స్టాన్లీ ఏ. కొచానెక్ చక్కగా వర్ణించారు—

"పార్లమెంటరీ భాగాలలోనూ, పార్టీలోనూ కూడా కాంగ్రెసువారు ప్రధానమంత్రి పక్షనే ఉంటారు. ప్రధానమంత్రి అధికారం, పలుకుబడీ, పోషక శక్తీ—ఇవే దీనికి కారణం. కాంగ్రెసు అధ్యక్షుడికి వీటితో సరితూగే అధికారం ఏదియిరా ఉండదు అందుచేతనే కాంగ్రెసులో ద్వంద్వ నాయకత్వం అంటూ ఉండటానికి వీలులేదు. నిబంధనలు ఎలా ఉన్నప్పటికి ప్రభుత్వం, పార్టీ అధికారి ప్రధానమంత్రి ఒక్కరే ఎన్నిక అయిన ఏ కాంగ్రెసు ప్రభుత్వమూ పార్టీ అధ్యకుడి శాసనాన్ని శిరసా వహించదు కాంగ్రెసు అధ్యక్షుడి పలుకుబడి తన స్వంత శక్తి మీదనే కాక ప్రధానమంత్రి విశ్వాసం మీద కూడా ఆధారపడి ఉంటుంది. ఒకవ్యక్తి నాయకత్వం స్థిరపడే దాకా అధ్యక్షుడి పలుకుబడి బాగానే ఉంటుంది కాని ప్రభుత్వం చక్కగా నడవడం మొదలు పెట్టాక పార్టీ అధ్యక్షుడిది ద్వితీయ స్థానమే.

## పార్టీ, దేశం

'అంతే కాదు, ప్రధానమంత్రి మెజారిటీ నాయకులే కారు, దేశానికంతా నాయకులు కాంగ్రెసు అధికారం క్షీణించిన కొద్దీ ఈ విషయం మరింత ముఖ్యం అవుతూ వచ్చింది. భారతదేశం సమైక్యత నిలవాలంటే, ప్రభుత్వం సాఫీగా నడవాలంటె ప్రధానమంత్రికీ, ప్రతిపక్షాలకి చెందిన

ముఖ్యమంత్రులకీ మధ్య పొత్తు కుదరాలి 1966 లోనూ, 1967 లోనూ కూడా శ్రీమతి గాంధికి ప్రధానమంత్రి అయ్యే అర్హత దీని మీదనే ఆధారపడి ఉన్నదనవచ్చు.

"మొత్తంమీద, కాంగ్రెసు అధ్యక్షుడి ఎన్నిక తతంగం, ఆ అధ్యక్షుడి కొక రాష్ట్రపతి గౌరవాన్ని ఇవ్వటం అప్రస్తుతాలయి పోయాయి. ఒకే ఒక పార్టీ అధికారంలో ఉన్నప్పుడు ఒకే ఒక వ్యక్తి అత్యధికారం కలిగి ఉండరాదనే వాదంలో నిజం ఉంది. కాని, కాంగ్రెసు అధికారం తగ్గిపోయినప్పుడు ఈ వాదానికి అంత బలం ఉండదు నాయకులయిన వారికి తమకి ఇష్టం వచ్చిన వారిని పార్టీ అధ్యక్షులుగా నియమించే శక్తి ఉండజాలదు ఇది ఎప్పుడూ జరిగేదే నాయకవర్గం కలిసి ఉన్నప్పుడు అందరికీ నచ్చిన అభ్యర్థి తేలికగా ఎన్నిక అవుతాడు. నాయకవర్గంలో చీలికలు ఉన్నప్పుడు బేరాలు జరుగుతాయి, లేదా బలాబలాలు తేల్చుకునే పోటీలు జరుగుతాయి. ఈ రకం చీలికలు రాకుండా ఉండటం కాంగ్రెసుకి అత్యవసరం. అయికమత్యం లేకపోతే పార్టీ ప్రభుత్వం నడవదు. రాష్ట్రాలలో ముఠాలు పెరుగుతాయి. చీలికలు అలాగే నిలిచిపోతే ఉన్న పరిస్థితులు మారకుండా ఉండే ప్రయత్నాలు జరుగుతాయి. దీనివల్ల పార్టీకీ, దేశానికీ కూడా లాభం కలుగదు."

## అమెరికన్ హెచ్చరిక

1968 లో ఒక అమెరికన్ రాసిన మాటలు కాంగ్రెసుకి హెచ్చరికగా పనికి వస్తున్నాయి. కాంగ్రెసులో అయికమత్యం లేకపోతే పరిపాలన స్తంభించిపోతుందని ఆయన స్పష్టంగా నిరూపించాడు.

పరిపాలన కొన్ని నెలలుగా ఆగిపోయింది. ప్రధానమంత్రి ఏమన్నప్పటికీ నిలకడ బాగా తగ్గిపోయింది. కాంగ్రెసులోని చీలిక సయినుంచి పల్లెల దాకా వ్యాపిస్తుంది. కొంతకాలం దాకా దేశం అంతటా ఉత్పత్తి, అభివృద్ధి—వీటిని చెడగొట్టే పేచీలు జరుగుతూనే ఉంటాయి. లిటిగేషన్ల బరువు కింద దల లేకుండా ఉండిపోతాయి జోడెడ్లు. ఇదంతా వరికి లాభం? కమ్యూనిస్టులకీ, జనసంఘానికీ.

## శ్రీ డాంగే వ్యాఖ్య

శ్రీ డాంగే ఒక హెచ్చరిక చేశారు. బొంబాయిలో మాట్లాడుతూ ఆయన అన్నారు— కాంగ్రెసులో తిరోగమన, పురోగమన వాదుల మధ్య యుద్ధం చెలరేగినప్పుడు పురోగమనవాదులని బలపరచటం మన కర్తవ్యం, అని. ముందు మానోపలీ వర్గాన్నీ, తిరోగమనవాదులనీ హతమార్చాలని ఆయన చెప్పారు.

'ఇందిరా—వర్గా'న్ని బలపరిస్తే దేశంలో సోషలిజమ్ అవతరిస్తుందని ఆయన అన్నారు. వామపక్షానికి చెందిన ప్ర. సో. పా., సం. సో. పా.లు ఒకటిగా నిలిచి కాంగ్రెసులోని తిరోగమన వర్గాన్ని మాపుమాపాలని శ్రీ డాంగే చెప్పారు.



# సెకండ్‌హేండ్ పెళ్ళికొడుకు

యాజుషి

'ఏమండోయి రాజగోపాలంగారూ కులాసాగా ఉన్నారా ? ... ఎక్కడా కనిపించటం లేదేమండీ ఈ మధ్య ?' అంటూ హడావిడిగా వెడుతున్న రాజగోపాలంగార్ని వరదరాజులుగారు పల్కరించారు బజార్లో.

'ఏదండీ ఎక్కడా తీరటం లేదు. ఈ ఏడు మా అమ్మాయిపెళ్ళి జరిపించెయ్యాలని ప్రయత్నాలు గట్టిగా చేస్తున్నాను. ఇవాళ ఒకరు వస్తున్నారు అమ్మాయిని చూసుకునేందుకు.'

'అల్లాగా... 'శుభస్య శీఘ్రం' త్వరగా మాకు పప్పన్నం దొరుకుతుందన్న మాట' అంటూ నవ్వేసారు వరదరాజులుగారు.

'ఆ...ఏం పప్పన్నమో ... నాకు ఏడు తరాల తాతలు దిగొస్తున్నారు పెళ్ళిసంబంధాలు వెతకలేక'

'అవున్లెండి ఈ కాలంలో ఏదైనా దొరుకుతున్నది కాని పెళ్ళికొడుకు దొరకటం మహా అవస్థగా ఉంది. ఇంతకీ పెళ్ళివాలొస్తున్నారన్నారు. పెళ్ళికొడుకు ఏమాత్రం తూగుతున్నాడేవిటి ? అహ మనలో మనమాట. ఊరికే అడిగాను'

'ఆ...పెళ్ళికొడుకా... పెళ్ళికొడుకు..' అంటూ దీర్ఘం తీసారు, నాన్చుతూ రాజగోపాలంగారు.

'అదేవిటండోయి అల్లా నాన్చేస్తున్నారు ?'

'ఏం చెప్పమంటారు. ఇవాళ వస్తున్నాడే అతను సెకండ్‌హేండ్ పెళ్ళికొడుకు మరీ పాత సెకెండ్‌హేండ్ కాదులెండి. కాస్త కొత్త సెకండ్‌హేండ్.'

'అంటే ?'

'అంటే అర్థంకాలా ? రెండోపెళ్ళివాడు. ఈ మధ్యే భార్యావియోగం సంభవించినవాడు. వడుచు కుర్రాడు. జంజాటం లేనివాడు. మరీ పాతవాడంటే కాస్త పిల్లలుండి, కొన్నేళ్ళ సంసారం ఈదినవాడు. తెలిసిందా మనలాంటివారికి ఫస్టు హేండ్స్ గాళ్ళు అందుబాటులో లేరండి...

ఎక్స్‌పోర్టెడ్, అంటే ఫారిను వెళ్ళినవాడు, ఇంపోర్టెడ్‌అంటే ఫారిన్ రిటర్న్‌డ్, రెడీమేడ్, అన్‌రెడీమేడ్, క్లాస్ వన్, రిగ్నిఫైడ్, లోయర్‌క్లాస్, బర్డెన్డ్ అంటే ఇంకా చదువుకుంటున్నవాడు ఇలా ఇంకా ఇంకా చాలా రకాలున్నాయిలెండి పెళ్ళికొడుకుల్లో. పైగా ఈ సెకండ్‌హేండ్ గాళ్ళుమాత్రం తక్కువ తిన్నారా చెప్పండి? వీళ్ళకూడ మార్కెట్టులో పై మెట్టు మీద కూర్చుందామనే చూసారు. ఏవిటో కలికాలం కన్యల్లో మండిపోతోంది ... ఆ మరి నే వెడతా. లవతల ఆలస్యం అవుతుంది.'

'అయ్యయ్యో వెళ్ళిరండి. ముందు మీ పని ముఖ్యం. తర్వాత కలుద్దాం లెండి.' అని వరదరాజులుగారు ఈనాటి వ కట్నాల పాటలు, కన్యాదాతల పాటూ

తలుచుకుంటూ పాలోచనగా సాగిపోయారు.

* * *

గబ గబా ఇంటికివచ్చిన రాజగోపాలం గారు ముందు గది అంతా జాగ్రత్తగా సర్దించారు

పెళ్ళి కుదిరేందుకు ఈ తతంగాలకే వో వరకట్నం అంత ఖర్చవుతోంది అని మనసులో గొణుక్కున్నారు.

పెళ్ళిచూపుల కొచ్చేవారికి స్వీట్సు, హాట్సు, డ్రింక్స్ ఎక్సెట్రాలు ఏర్పాట్లు చకచకా సాగిపోతున్నాయి వంటఇంట్లో.

నడిమిటింట్లో బలి పశువు (పెళ్ళి కూతురు)కి ముస్తాబులు చేస్తున్నారు ఉక్కయ్యలు, వదినలు, ఇరుగుపొరుగు అమ్మలక్కలూను

మొట్టమొదట జడదగ్గర వచ్చింది. ఎల్లా జడెయ్యాలి? వదులుగానా, బిగువుగానా? సగానికి వదిలేసా? చివర్న కుచ్చులు పెట్టాలా? రింగులుగా వదిలెయ్యాలా? ఏ విధంగా అతనికి నచ్చుతుంది? అనుకుంటూ తర్జన బర్జనలో ఆటూ ఇటూ గాకుండా వేసారు జడ.

ఆ తర్వాత చీర. వుల్ వాయిలా? నైలెక్సా? టెరీ కాటనా? వెంకటగిరా? గద్వాలా? జార్జెట్టా, కంచీవరమా? కంచి పట్టా? పటోలా వద్దూ? ఏం కట్టాలి అని మళ్ళీ వోలరగంట తల్లకిందులై మరీ అంత పాతకాలంగానూ, మరీ అంత పైలా పచ్చీసుగానూ లేకుండా జరీబోర్డరున్న జార్జెట్ చీర, పువ్వాయిల్ బ్లవుజూ కట్టబెట్టారు ముందుకి (అంటే పెళ్ళికూతురు మాట్లాడకూడదుగ!)

ఒల్లో నాజూగ్గా వో జాజిదండా, రెండు సంపెంగలూ పెట్టారు దోసగింజ బొట్టు పెట్టారు. మరీ ఎక్కువ నగలు పెడితే అన్నీ ఆ పిల్లవేనని ఆశపడతాడేమో ఆ కాబోయే ఘటికుడని కొంచెం నగలే పెట్టారు.

ఏదోవిధంగా అందరూ తలో సలహా, తలో అలంకారం, తలో సూచనతో గంగిరెద్దు వేషం పూర్తయింది. (పెళ్ళికూతురి వేషం)

ఈ గోలకంతటకీ పెళ్ళికాని అమ్మాయి అందరి గుండెల్లాగే రజని గుండెలూ బాధతో రాజుకున్నాయి.

ఒకరిముందు ఆటబొమ్మలా నిలబడే స్థితికి ఉద్రేకం, కోపం, ఆ అసహ్యం, ఆడపిల్లగా పుట్టినందుకు తనమీద తనకే జాలీ, ఏమీ చెయ్యలేని నిస్సహాయత్వం మరెన్నో, మరెన్నో భావాలు లావాలా ఎదలో సెగలు, పొగలు చిమ్ముతూ ఉంటే—కుత కుతమని అంతరంగంలో ఉడికిపోతూ కందగడ్డలాంటి ముఖంతో అసహనంగా వచ్చి కూర్చుంది పెళ్ళి చూపులకి

ఛీత్కారంగా ఆవచ్చిన ప్రబుద్ధుడి వైపు చూసింది.

ఎన్నడూ ఆడపిల్లని ఎరగనట్లు ఆకలిగా, ఆత్రుతగా చూస్తున్నాడు 'నాకేం పెళ్ళికొడుకుని' అన్న దర్పంతో సభ్యతల్ని విస్మరించిన అద్వితీయ వివాహ పురుష చక్రవర్తి.

సంతలో పశువుని పరీక్షించినట్లు, చిత్తం వచ్చినట్లుగా నఖశిఖ పర్యంతం రజన్ని నిదానంగా పరీక్షించాడు ఎక్సరే చూపుల్తో [illegible] అదో కాజు' ఆ పెళ్ళి కొడుకులుంగారు!

అమ్మాయిని చూస్తూ, తియ్యగా, కమ్మగా, వేడిగా, కాఫీ ఫలహారాలు, అమ్మాయి అందచందాలు విందారగింపాడు సెకెండ్ హేండ్ పెళ్ళికొడుకుగారు.

అతనికి అడుగులకి మడుగులొత్తుతూ 'సరే' అనేమాట అతని నోటినుంచి అమృత ప్రాయంగా వినేందుకు తహతహ లాడుతున్నారు రాజగోపాలంగారు

ఎప్పుడు ఈ నగ్న పరీక్ష (అంటే అంతలా పరీక్షిస్తున్నాడు అతను!) పూర్తవుతుందా, ఎప్పుడు లోపలికిపోయి ఊపిరి పీల్చుకుందామా అని తహతహ చెందుతోంది రజని.

'వెళ్ళమ్మా లోపలికి' అన్న ముక్క చెవిన పడ్డంతోటే 'బ్రతుకుజీవుడా' అనుకుంటూ లేంగున నడిమిటింట్లోకి గంతే

**డాక్టర్ కబుర్లు**

# పెద్ద పుట్టుమచ్చలు

కొందరికి పెద్ద పుట్టుమచ్చలు ఎన్నో రంగుల్లో ఉంటాయి. ఇవి క్రమంగా పోవచ్చు పెద్దవీ కావచ్చు.

వీటివల్ల మానసికమయిన బాధ కలగవచ్చు అవి ఉన్న వారు తమ ఆకృతి చెడిపోయిందనుకోవచ్చు.



ఇటువంటి వాటిని వీలయినంత త్వరలో తీసివెయ్యటం మంచిది డాక్టరుని సంప్రదించటం ఎప్పుడూ ఉత్తమం.

చిన్నపిల్లల కయితే పుట్టిన వెంటనే తీసివేయించటం మరింత ఉత్తమం. ఇటువంటి పుట్టుమచ్చలు సాధారణంగా కాన్సర్ కారణాలు కావు.

హెచ్. ఎల్. హెర్సన్‌సోన్

(కాపీరయిటు)




చిలుక అంటే ఆకుపచ్చని రామచిలుక అని వెంటనే తడుతుంది. మన కావ్యాల్లో దీని పాత్ర ఎంతో ఉంది. చిలుకల ప్రేమ ఎంతో తల్చుకొంటూ ఉంటాం. 'చిలుకా గోరింకల్లా' అని ఎందుకంటామో కాని, వేటికవి విడివిడిగా ఎంతో ప్రేమగా ఉన్నా, ఒక దానికి ఇంకో దానికి సంబంధం లేదు. అలా కట్టడం అవివేకం కూడా.

చిలుకలని వాటి ముక్కునిబట్టి తెలుసుకోగల్గుతాము. అది కొక్కెం మాదిరిగా వంగి, పళ్లు తినడానికి ఎంతో వీలుగా ఉంటుంది.

మనకు ఆకుపచ్చ రామచిలుక ఎంత పరిచయమైనా, నిజానికి చిలుకలు అనేక రంగుల్లో ఉంటాయి. ఆస్ట్రేలియా న్యూజిలాండులో ఇవి విరివిగా ఉంటాయి. దక్షిణమెరికాలో ఉన్నాయి. ఆఫ్రికాలో కూడా ఉన్నాయి.

'మెకా' అనే చిలుకలు అమెరికాలోఉన్నాయి. రక్తవర్ణం, ఆకాశనీలం, పసుపు వర్ణాలతో ఎంతో మెరిసి పోతుంటాయి.

'కక్కటూ' అనేది ఆస్ట్రేలియా చిలుక. దీనికి నెమలి లాగా పించం కూడా ఉంది. తెల్లగా ఉండడం వీటిలో కొన్నిటి ప్రత్యేకత, కొన్ని నల్లగా ఉంటాయి. ఆస్ట్రేలియాలోనే పెరాకీట్లు [లారికీట్లు] అనే చిలుకలు కూడా ఉన్నాయి. ఇవి తేనెను పీల్చి జీవిస్తాయి.

అయితే ఆఫ్రికాలో కొన్ని చిన్నచిన్న చిలకలున్నాయి. అతి ముచ్చటగా ఉంటాయి. జతల్లో అతి ప్రేమతో తలతల నిమురుకొంటూ ఉంటాయి. వాటి గాఢప్రేమకు వేరే నిదర్శనం పనిలేదు. అందుకే వాటిని ప్రత్యేకం, ''ప్రేమపక్షులు'' అంటారు.

చిలుకల నాలుక మందంగా ఎర్రగా ఉంటుంది మందంగా ఉండడంవల్లనే అది మనలాగే మాట్లాడగల్గడం నేర్చుకొంటుంది.

ఇంకో చిలుక ఉంది. అది చెప్పి చిలకలమీద మీకు ఉండే గౌరవం పోగొట్టినా, చెప్పడం నా బాధ్యత. న్యూజిలాండులో 'కీ' అనే చిలుక ఉంది. ఆకుపచ్చగానే ఉంటుంది. మొదట్లో పళ్ళు, గింజలు మహా అయితే పురుగులు తినేది కాని క్రమంగా మాంసం తిండం అలవాటు చేసుకొంది. అంతతో పూరుకోక గొర్రెలని బాధపెట్టటం నేర్చుకుంది. కొన్ని, గుంపుల్లోచేరి, గొర్రెలని చీకాకుపెట్టి అలయగొట్టి, గాభరాపెట్టి వీపు మీదచేరి గాయాలు చేసి, మాంసం, ముఖ్యంగా మూత్రపిండాలు తినడం అలవాటు చేసుకొన్నాయి. ఇదే అలవాటు వాటి నాశనానికి దారితీస్తుందేమో (మనిషి పూరుకుంటాడా!)

ఇంతకూ దానికి ఈ పాడు అలవాటు ఎలా వచ్చిందో ఎవరికీ అంతు పట్టలేదు!

## సెకండ్ హేండ్ ...

సింది రజని. ఆ తర్వాత ఊపిరి హాయిగా నిండుగా పీల్చుకుంది.

అట్నుంచి ఇటూ, ఇట్నుంచి అటూ కాలుగాలిన పిల్లిగా తిరుగుతోంది రజని తల్లి మంచి మాటకోసం.

బేరాలు ప్రారంభమయ్యాయి ముందు గదిలో.

ఏడెనిమిది వేలయినా లేందే తాళికట్టేది లేదని ఖచ్చితంగా నిర్వచించేసాడు సెకండ్ హేండ్ పెళ్లి కొడుకు.

గతుక్కుమన్నారు రాజగోపాలంగారు. మరీ ఇంత అన్యాయమా? సెకండ్ హేండ్ గదా చవకలో వస్తాడనుకున్నారు. ఇతను చూస్తే ఫస్ట్ హేండ్ రేట్లోకి సమీపంగా జరిగి కూర్చున్నాడు. 'ఇదేంరా దేముడా' అని నెత్తి మొత్తుకున్నారు మనసులో. ఎదురుగుండా మొత్తుకుందుకు లతను ఉన్నాడుగా మరి.

మధ్యవర్తి ద్వారా చెప్పించారు ద్వితీయం కదా కాస్త కిందకి దిగమని.

'ద్వితీయమైతే మీకేం నష్టం వచ్చింది? నేనేం ముసలివాణ్ని కాదు. పిల్లలున్నవాణ్ని అంతకన్నా కాదు. అది అనుభవించే గీత లేక ఏడాదిలోగానే పోయింది నన్నొదిలి ఆ లోకాన్కి. దానికి నా తప్పేం లేదుగా. వయసులోున్న కోరికలు తగ్గాయా ఏమన్నా? ద్వితీయం అనే అనుమానం అయినా కలగకుండా ఉండేలా మీ అమ్మాయిని సుఖపెడ్తాను మీ ఇష్టం అయితే మూడుముళ్లూ మీ పిల్లమెడలో వేస్తాను. లేదా మరోపిల్ల.' అనేసి గమ్మున ఊరుకున్నాడు సదరు పెళ్లికొడుకు రెండో పెళ్లిముచ్చట్లు ఏమాత్రం తగ్గకూడదనే పట్టుదలతో.

ఎట్లాగో గీచి గీచి ఆరువేలకి ఒప్పించేసరికి తలప్రాణం తోకకి వచ్చింది రాజగోపాలంగారికి.

ఏదో ఉద్ధరించేస్తున్నట్లు ముఖం పెట్టి జెట్టుగా 'సరే' అన్నాడు సెకండ్ హేండ్ మాత్రధారణ చేసే వానరావతారుడు మందస్మిత వదనంతో.

'హమ్మయ్య' అని నిట్టూర్చారు రాజగోపాలంగారు సతీ సమేతంగా

రజని మనసు మూగగా రోదించింది.

* * *

చివరి ప్రయత్నంగా తల్లివద్ద మొర పెట్టుకుంది.

'అమ్మా ఇప్పుడర్జంటుగా పెళ్ళి చేసెయ్యాలా నాకు ? ఏం మునిగిపోయిందని ? అవతల చిన్నన్నయ్య ఫైనలియరులో ఉన్నాడు. ఇప్పుడు వాడికి బోల్డు డబ్బు పంపాల్సి వస్తోంది. ఇదివరకు అక్కయ్యల పెళ్ళిళ్ళకని, అన్నయ్యల చదువులకని, సరదాలు వాటికని అయిన అప్పులు పాపంలా పెరిగిపోతూనే ఉన్నాయి. ఇది చాలక ఆరువేలు కట్నం, పెళ్ళిఖర్చుకి మరో మూడు నాలుగువేలూ ఖర్చుపెట్టి ఇంకో కొత్త అప్పు సృష్టించుకోక పోతేనేం ? అమ్మా కొన్నాళ్ళు పోయాక చేద్దురుగాని పెళ్ళి. నామీద కోపగించుకోకమ్మా. నేను చెప్పేది విను' అంది మెల్లిగా తలొంచుకుని.

తెల్లబోయింది ఆవిడ రజని మాటలకి కూతుర్కి ఉన్న ముందు చూపుమీద మనసు చెమర్చింది ఆవిడకు, కూతురిమీద అభిమానంతో.

'వెర్రితల్లీ. నీ కెందుకమ్మా ఆ గొడవలు. మా తిప్పలు మేం పడతాం కదా కన్నందుకు పెళ్ళి చెయ్యక తప్పుతుందా తల్లీ. అక్కయ్యల పెళ్ళిళ్ళు చెయ్యలా. అల్లాగే తలో తాకట్టు పెట్టి నీకు వివాహం జరిపించెయ్యాలి. ఆడపిల్ల దారి వేరమ్మా, ఎన్నాళ్ళకయినా ఓ ఇంటిదాన్ని చెయ్యాల్సిన బాధ్యత తప్పదుగా. ఏదో సంబంధం మాకు తూగగల్గింది ఇన్నాళ్ళకి దొరికింది. మరి అటువంటప్పుడు వదులుకోవటం మంచిది కాదు. నిన్ను రెండో పెళ్ళి వాడికిచ్చి చేస్తున్నందుకు మనసులో బాధగా ఉంది కాని ఏం చేస్తాం తల్లీ. ఈ రోజుల్లో ఎవరూ దిగిరావటం లేదు. ఇతనైనా వయసు మీరినవాడు కాదు ఏదో ఇంత సంపాయించుకుంటున్నాడు మా గొడవలు ఇల్లా ఉండేవే. అందుకని నువ్వెన్ని రోజులు అవివాహితంగ ఉంటావు చెప్పు ? నా మాట విని మనసులో మధనపడక ముహూర్తం పెట్టనియ్యి. నీ పెళ్ళి చేసుకో మా ప్రాణం కుదుటపడుతుంది, బాధ్యతా, బరువూ తొలగుతాయి మాకు' అంది ఆవిడ రజని తల నిమురుతూ.

*   *   *

'ఆఖరి ప్రయత్నం కూడా విఫలం

# అక్షయ హారం

## కార్టూను గేయాలు

*** శిశిర ***

(గత సంచిక తరువాయి)

30 అరిచేనుండి అణువుదాక
అడిగవచ్చు మీ ఓపిక
విప్పే పనివాడితనం
మాలతీ ప్రమోదవనం







32. తలబిరుసనిపించు పాటి
ములుకువంటి పలుకుతోటి
పాంచవాటి వాక్పటూటి
హాస్య చమత్కార వాటి.

(ఇంకా ఉంది)




31. కార్టూనులు గీయాలని
ఉబలాటం కలిగెనేని
బారల పులి నలిగేరంబు
కిటుకులన్ని తెలిసికోండు.

# సెకండ్ హేండ్...

దాగా ఓడిపోయిన గుండెలో భారంగా వచ్చి తనగదిలో మంచంపై వాలిపోయింది ఎందుకో.

తిరిగి అంతలోనే మానసాకాశాన మేఘాలావరించాయి.

స్త్రీ స్వాతంత్ర్యం అంటూ గొంతు చించుకుని అరుస్తారు. పిసరంత స్వతంత్రం కూడా ఈనాటి ఆడపిల్లలకి లేదు. ఆడపిల్లని ఎంత త్వరగా వదిలించు కుందామని చూస్తారే తప్ప స్వంతకాళ్లపై నిలబడి స్వేచ్ఛగా బతికేందుకు అవకాశాలు కలిగించరు. ఎంత చదివినా చివరి మెట్టు పెళ్లి. అది తప్పదు.

ఆ పెళ్లి ఆడపిల్లల పాలిట అశని పాతంలా తయారయింది. ఎన్నో మధురమైన ఊహలతో, ఆనందభరిత జీవితం రుచి చూడాలని ఆశిస్తూ కలలు కనే పిల్లలకు కంటక ప్రాయమైన జీవితాలు ఎదురయ్యే పరిస్థితులు ఏర్పడుతున్నాయి ఈనాటి వరకట్న పిశాచంవల్ల.

చదువంటే చెప్పినమాట వినదంటారు. చదువుకోకపోతే పల్లెటూరి మొద్దు, తెలివితక్కువ దద్దమ్మ అని తేలిగ్గా చూస్తారు.

సంగీతం, సాహిత్యం మొదలయినవి కొంతమంది కావాలంటారు. పోనీ సంగీతం సాహిత్యం, వగైరాల్లో అభినివేశం పొందితే 'ఆ... సంసారిక్కి ఇవెందుకూ...?' అని సాగదీస్తారు.

అబ్బబ్బ ఈ పెళ్లిచూపుల ఇంటర్వ్యూ ఐ. ఏ. ఎస్. కన్నా కష్టంగా ఉంటోంది ఆడపిల్లల పాలిట. 'ఖర్మ' అని నెత్తిబాదుకొంది రజని. ప్రతివాడికీ కన్యలే కావాలి కాని రెండో పెళ్లివాడు రెండో పెళ్లి ఆడదాన్ని ఛస్తే అంగీకరించడు.

కన్నవారు అప్పుల సముద్రంలో మునిగిపోతుంటే నీళ్లు నిండిన కమండోయిలో, కొత్తరకం కష్టాల కాపురంకై కలలు కంటూన్న కన్నెమనసుతో మూడుముళ్లు వేయించుకుంది రజని.

తలంబ్రాలు నిప్పు కణికల్లా తలనిండా పోశాడు సెకండ్‌హేండ్ పెళ్లికొడుకు ఇనుమడించిన ఉత్సాహంతో.

మూగపోయిన మనసుతో పరధ్యానంగా శూన్యంలోకి చూస్తూ కూర్చుంది ఈనాటి ఆడపిల్లల మోడల్ రజని. ●

# ఒక వారం విపరీతం
## పాఠకుడు

## ప్రేమ - ఆవేశం!

కట్టామడుగు అనే వూళ్ళో రాజు అనే అతను ఒకామెను ప్రేమించాడట. ఆ పిల్ల తలిదండ్రులు ఆమెకు వేరే సంబంధం నిశ్చయం చేయడంవల్ల ప్రేయసీప్రియులిద్దరూ పారిపోయారట. వో పది రోజులు ఎక్కడో వుండి, ఆనక అదే వూళ్ళో ధైర్యంగా భార్యాభర్తల్లా వుండసాగారట. అయితే ఆవేశం చల్లారాక, ఒకరంటే ఒకరికి అసహ్యం పుట్టి, రాజు [ప్రియుడు] తో తెగతెంపులు చేసుకుని, అతని ప్రియురాలు చిన్నమ్మాల్ పుట్టింటికి చేరిందట. ఇంత జరిగినా, "మా అబ్బాయిని మా అమ్మాయికే యిస్తాం[!]" అని పాత సంబంధపు కాబోయిన మామగారు తొప్పై యస్ భరోసా యిచ్చి, ఆమెను తమ ఊరుకు తీసుకు వెళ్ళబోతుంటే— యీ సంగతి విన్న రాజు చట్టున వో కత్తి తీసుకెళ్ళి తొప్పై యస్‌ని పొడిచి చంపేశాడట ఈ రాజుకి చట్టం యావజ్జీవ శిక్ష విధించింది.

*　　*　　*

బెంగుళూరులో లింగరాజపురానికి చెందిన జోసఫ్ అనే 19 ఏళ్ళ బాలుడు గాలిపటం ఎగరేసుకుంటూ ఆనంద పారవశ్యంతో పట్టాలమీద నిలబడివుండగా ఒనే సమయానికి వచ్చిన ట్రైను అతన్ని నలిపి చంపేసిందట— తొందరపాటు!

## మాటకి మాట...

తిరువత్తూరుకు చెందిన పెరుమాళ్ అనే కార్మికునికి మరి కొందరికి ఏవో మాట తేడా వచ్చి, అది అంతటితో ఆగక, ఆవేశాలతో కలిసి రణరంగం అయిందట. అవతలివారు పెరుమాళ్ళును పొడిచి పారిపోయారట అతను వేలూరు ఆసుపత్రిలో మరణించాడట—ఇంతకే గొడవేమిటో..... ఏమో!!




## ఒకే కాన్పులో నలుగురు పిల్లలు!

మధురలో సుత్‌గా బీబీ అనే ఆమెకు ఒకే కాన్పులో నలుగురు పిల్లలు పుట్టారట ఈ వార్త అంతా విన్నారు. కాని 'రాణి' అనే ఒక తమిళ పత్రిక 'బీబీ' తన పిల్లలను పోషించడానికి నిధి పోగుచేసి యిచ్చిందట. మొత్తం వసూలైన 14 వేల 5 వందల రూపాయలూ తమిళ సినిమా నటి పుష్పలత నేత యిప్పించారట.

## సినిమాలో స్నేహం!

తన పేరు రామిరెడ్డి అనీ, తెలుగువాణ్ణనీ ఒక అతను చెప్పి, పాపన్న అనే అతనితోనూ, రామన్న అనే అతనితోనూ ఒకతను స్నేహం చేసుకున్నాడట వో సినిమాహాలులో సినిమా వదిలాక వారిద్దర్నీ ఒక హోటలుకు తీసుకు వెళ్ళాడట మస్తుగా టిఫిను పెట్టించి, కారో ఎక్కించి, మా యింట్లో దిగవిడుస్తాను అని బయల్దేర దీసి, దారి మధ్యలో కారాపి, పాపన్న వద్దనున్న నాలుగువేల రూపాయలూ వూడ లాక్కున్నాడట అంతలో అక్కడికి ఒక మోటారు సైకిలు మీద యిద్దరు వ్యక్తులు వచ్చి దిగారట అందులో ఒకరు తను పోలీసు ఆఫీసరునని చెప్పి, రామిరెడ్డిని స్టేషనుకు రమ్మని తన మోటారు సైకిలు మీద ఎక్కించుకు పోయాడట వారంతా ఒకే గ్రూపుకు చెందినవారని తెలిసి, మోసపోయిన పాపన్న రామన్న పోలీసు శరణు కోరారట. వీరిద్దరూ పండ్ల వ్యాపారులట. ఇది బెంగుళూరులో జరిగింది

## పడక గదిలో నిప్పు?

డోవర్ [ఇంగ్లాండ్] లో ఒక యింటిలో పడక గదిలో పుట్టిన నిప్పు కర్టెనులకు అంటుకుని ఆ గదిలో నిద్రపోతున్న ఏడుగురు మగపిల్లలను, ఇద్దరు ఆడపిల్లలనూ పొట్టన పెట్టుకుందట. వీరంతా ఒక తల్లి సంతతేనట ఇంతకీ అక్కడ ఆ నిప్పు ఎందుకు, ఎలా పుట్టిందో మాత్రం తెలియలేదు.

## ప్రదేశం ఏదైనా ఫలితం ఒక్కటే!

పాస్టిస్ అనే ఒక మద్యపానీయంలో కనీసం ఒకటికి ఐదు పాళ్ళు నీళ్ళు కలిపితేగాని త్రాగడం కష్టమట అలాంటిది వో చుక్క నీరైనా కలపకుండా పది గ్లాసులు త్రాగుతానని 47 ఏళ్ళ హోట్లో ఏన్ బర్క్ అనే ఆయన పందెం గట్టి, టప్పున పది గ్లాసుల పాస్టిస్ త్రాగి, అక్కడికక్కడే మరణించాడట ఆయనకు భార్య నలుగురు పిల్లలు వున్నారట. ఇది స్విట్జర్లండుకు చెందిన ఫ్రాన్ అనే చోట జరిగింది ఎక్కడ ఎప్పుడు జరిగినా ఫలితంమాత్రం అలాటి వాటికి ఒకటే కదా!

## గుర్తుతెలీని హంతకులు

జలందర్‌లో రోడ్డుమీద నడుస్తున్న రతన్ సింగ్ అనే అతన్ని ఎవరో గుర్తు తెలియనివారు పట్టుకుని కాల్చి చంపేశారట రతన్‌సింగ్ అనే ఆ జర్నలిస్టునేగాక, మరో యిద్దర్ని కూడా కాల్చి అంతర్ధానమై పోయిన ఆ ఏరుగు కోసం పోలీసులు విచారిస్తున్నారు

## విఫల ప్రేమ- విద్యార్థి ఆత్మహత్య

చిత్తూరు జిల్లాలోని పెనుమూరులో నాగేశ్వరరావు అనే వో డాక్టరుగారి 18 ఏళ్ళ అమ్మాయి ఒకమ్మాయిని ప్రేమించాడట తలిదండ్రులు నర్ ఏత్లేదు అనేసరికల్లా ఆ 18 ఏళ్ళ వెంకట రమణరావు విషం తాగి, మరణించాడట ఇతను చిత్తూరు ప్రభుత్వ కళాశాల విద్యార్థిట. ప్రేమలాటి వ్యవహారాలలో తలిదండ్రులు కలుగ జేసుకో పోతే ఏం! ఏమంటారు! డింకేమైనా!!!



## కంప్యూటర్ పెళ్ళిళ్లు

పశ్చిమ జర్మనీలోని ఒక మేరేజి బ్యూరో [పెళ్ళిళ్ళు ఏర్పాటు చేయు చోటు] కి వచ్చే దరఖాస్తుల సంఖ్య ఎక్కువయి పోయినందువల్ల వరుల అర్హతలు, వారి వధునారిటీ వగైరాలన్నీ చూసి, వారికి తగిన వధువులను తమ వద్ద వున్న దరఖాస్తుల నుంచి ఏరి వప్పగించే బాధ్యతను కంప్యూటర్‌కు వప్పజెప్పారట. ఆ కంప్యూటరు మిషనే వధువును ఎంచి "నీ కీమె తగినది" అని ఆ పేరు లాగుతుందట. ఫెంటాస్టిక్! ఆ కంప్యూటరు యింతవరకూ ఎట్టి ఆటంకమూ లేకుండా రెండువేల పెళ్ళిళ్ళు చేసి, మరో 2500 పెళ్ళిళ్ళు ఒప్పందాల వరకూ ఏర్పరచిందట. ఆహా.... ఏ మోడరన్ పెళ్ళిళ్ళు పేరయ్యా!!




## హాస్య నటునిపై మాయ చేశాడన్న అభియోగం

51 సంవత్సరాల వయస్సున్న ఐ. యస్. జోహార్ అనే ప్రముఖ హాస్యనటుడు [హిందీతెర], నిర్మాత, దర్శకుడు 18 ఏళ్ళ మీనాసామ అనే ఆమెను వివాహం చేసుకున్నాడట. అయితే ఆమె ప్రముఖ హిందీ సినిమా కెమెరామన్ జాల్‌మిస్త్రీ అనే ఆయన భార్యట. ఆమెకు ఒక కొడుకు కూడా వున్నాడట. పార్సీ మతస్థుడైన మిస్త్రీ ఆమెను వివాహం చేసుకోడం కోసం మంతం మార్చుకుని సిక్కుమతం పుచ్చుకుని 1967 డిశంబరు 19 న వివాహం చేసుకున్నాడట. సినిమాలో జేరుస్తానని చెప్పి తన భార్యను మోసం చేసి మాయ చేశారని జోహార్—ఆ మిస్త్రీ జోహార్‌పై కేసు పెట్టారట. ఇదీ కథ ●

# ప్రమదావనం

**.... కె. రామలక్ష్మి ....**

**టి. ఎస్. పి., టి. ఎస్. ఆర్,**
**సంత్రాగచ్చి (ప. బెంగాల్)**

న్యాయముగా బ్రతికే అనాథలకు సక్రమము జరగడంలేదు. అన్యాయంగా ప్రవర్తించే అగంతకులకు సక్రమముగా సాగిపోవుచున్నది. లేదా ?

ఏమిటి?! . అందుకేగా ఓ అభ్యుదయ భావాగ్రణి అయిన సినీ నిర్మాత 'పవిత్ర పతితగాథ'ను వెండి తెర కెక్కిస్తున్నానంటూ వార్నింగు యిచ్చారు!

**ఎన్. ఎస్, ఇల్లెందు**

వయసు మదంతో కళ్ళు కనపడక సంచరించే మూర్ఖులను దేవుడెలా శిక్షిస్తాడంటారు?

శిక్షించడు. ఆ మూర్ఖత్వంలోనే అయ్యో భగవంతుడా అని ఏసారి అనుకున్నా బొందితో కైలాసానికి తీసుకుపోతాడని, అక్కడ రంభాదులున్నారని విన్నాను!

**ఎస్. ఎల్. సి. హైద్రాబాదు**

ఈ ఉద్యోగాలు చేస్తున్న ఆడపిల్లలు తాము పురుషులతో సమానం అని ఉద్యోగాలు చేస్తున్నారా ? ఉద్యోగంచేసి డబ్బు సంపాదించి ఆడబ్బు నిల్వచేసి కట్నంగా యిచ్చి పెళ్ళి చేసుకోవాలని ఉద్యోగాలు చేస్తున్నారా ? ఆడపిల్లల ఉద్యోగాలకు, కట్నాలకు రహస్య సంబంధం ఏదైనా ఉందా ?

ఆడపిల్లలు కొందరు—చాలా తక్కువమంది—సరదాకి ఉద్యోగాలు చేస్తూంటారు డబ్బు కూడబెట్టి కట్నం ఇచ్చి పెళ్ళి చేసుకుందామని చేసేవాళ్ళూ ఉన్నారు ఇల్లు గడవక చేసేవారూ ఉన్నారు ఇంకా వినండి అమ్మాయి కష్టపడి సంపాదించిచే ఎక్కువ కట్నం తేడానికి అబ్బాయిలని పైపై చదువులకి తర్లించే తల్లితండ్రులు, అమ్మాయి పెళ్ళి వయసు దాటిపోయింది కదా, నాకేనా పెళ్ళి చెయ్యండి అనే తమ్ముళ్ళూ 'అదెలాగా పెడుతోంది' అని తలితండ్రులని తిరిగి చూడని కొడుకులూ అంతా ఉన్నారు, యీ ఉద్యోగాలు చేసే అమ్మాయిల వెనక

**ఎ. వి. ఎమ్, ముసగపాక**

సినిమాలు చూడ్డం వల్ల చెడిపోతారని నా స్నేహితుడూ లేదు లాభాలున్నాయని నేను మీ రెవరి పక్షం?

ప్రతి పనివల్లా లాభపడేవాళ్ళూ, నష్టపడే వాళ్ళూ ఉంటారు—నాలోనికి బొమ్మా బొరుసులా.

**డాక్టర్ రమణా, మొగరాల**

మానవునికి చావు ప్రధానమా? డబ్బు ప్రధానమా?

ఏం ప్రశ్న బాబూ ఇది డాక్టరుగారూ? చచ్చాక డబ్బెందుకు? లేక 'పేషంటు చావు డాక్టరుకి డబ్బు' అని అడుగుతున్నారా?

**టి. ఆర్, విజయనగరం**

దుఃఖంలో ఎన్నో అనుకుంటాను. జీవితం ఎందుకు అనుకుంటాను సంతోషం వస్తే అన్నీ మరచిపోతాను. లోకం ఇంతేనా లేక నాకలా అనిపిస్తుందా?

లోకంలో అంతా అంతే సోదరీ, లేకపోతే దైన్యందిన చీకాకులని తట్టుకుని జీవితం నెట్టుకు రాగలమా? !

**జి పి, బందరు**

ఒక స్త్రీకి పెండ్లయి కాపురానికి పోయిన కొన్ని సంవత్సరాలకు కర్మము చాలక ఆమె భర్త చనిపోతే ఆ స్త్రీ పేద ముఖం చూడరాదు. అట్లా బయటికి పని మీద పోతే అనుమానపడే స్త్రీ పురుషులు ఉన్నారు. ఇటువంటి వారికి బుద్ధి ఎలా చెప్పాలి!

అసలింకా అలాంటి మనుషులున్నారా అని ఉంటే వారి నింకా పట్టించుకునే వారున్నారా అని!

**కళ్యాణశ్రీ, కోవెలకుంట్ల**

కఠిన పదాల ఉరువే లేకుండా సులభ పద్ధతిలో నవల రాస్తే ఏ పబ్లికేషన్సు వారేనా ప్రచురించుకోలరా?

మరిప్పుడు వస్తున్న నవలలన్నీ ఏ భాషలో వస్తున్నాయని మీ ఉద్దేశ్యం? ఏ పెద్దవారి భాషో తప్పించి అన్నీ మనుష్య భాషలో వస్తున్నాయి. మీకా బెంగ అక్కర లేదు.

మానవ జన్మ ఎత్తినవాడు రోజుకో సారేనా దేవుని సన్నిధిలో చేరాలంటారు ప్రస్తుత వ్యక్తులలో అటువంటి సూచనలు కనిపించకపోవడం ఎందుకు?

రోజుకోసారి దైవధ్యానం చేస్తారుగాని 'దైవసన్నిధి' చేరే ధీరులు లేరని కాబోలు మీ బాధ!

**ఎన్. ఎమ్ ఎల్, గన్నవరం**

వేవేమి వెర్రిప్రశ్నలు వేసి మిమ్మల్ని విసిగించలేదే. మీ స్నేహం కావాలన్నాను. లేకుంటే ఆ పేరుతో రాసే మగ కుర్రవాడమనుకున్నారా? కాదండీ నేను అక్కరాలా ఆడపిల్లని...

పరాయి మగవాడు ఉత్తరం రాశాడని దాచుకోవడం, సంబర పడిపోవడం, ఏదో ఎడ్వెంచరు చేసినట్టు గర్వపడ్డం, స్నేహితులకి అందరికీ చూపెట్టడం. . ఇదంతా చేయడానికి నేనేం పసిదాన్నా!! మీ ప్రశ్న కేం జవాబు వ్రాయాలని పూరుకున్నాను.... స్నేహభావం మనస్సులో ఉంటుంది. పార్శెలు కట్టి పంపలేనందుకు క్షమించాలి మరి.

**టి. పి ఎస్, నెల్లూరు**

ధర్మాన్ని గుర్తెరిగి యీనాటి వరకూ మా తనువులను ఏకం చేసికొనక మనసులను ఏకం చేసుకొని ప్రేమానురాగాలను పెంపొందించుకొన్నాము. వివాహమాడదలచాము...మేము ఎక్కడున్నా ఉద్యోగం చేసుకుని బ్రతకగలము.

ఆ నమ్మకం ఉన్నప్పుడు దేనికోసం వైట్ చేస్తున్నారు— గుళ్ళో పెళ్ళి చేసుకోనా? రిజిస్ట్రేషు ముందా? అనా?!

**వి వి ఆర్, కైకలూరు**

నేను ఒక మాసపత్రికలో మిమ్మల్ని గురించి ఇల్లిందల సరస్వతీదేవి గారిని గురించి పరిచయవ్యాసములో 'ఇరు ఫలానా సంవత్సరములలో గృహలక్ష్మి స్వర్ణకంకణాన్ని స్వీకరించారు అని వ్రాశారు అది ఒక బిరుదా? లేక గృహిణీధర్మాన్నే అలా వర్ణించారా?...వివరంగా ఉంటే జవాబివ్వండి...

గృహలక్ష్మి అనే ఒక మాసపత్రిక ఉండేది. కేసరిగారని ఒక మహావ్యక్తి ఉండేవారు వారా పత్రికకు స్థాపకులు ప్రతి ఏటా తాముత్తమ రచయిత్రిగా భావించినవారికి స్వర్ణకంకణాన్ని బహూకరించేవారు కేసరిగారు పోయినా ఆ సంస్థ వారికా ఇస్తూనే ఉన్నారు . అంతేగాని, వంటావార్పూ ఇంట్లో పెట్టిపోతలకి గుర్తింపు కాదది అది నిజంగా బంగారందే ఫరవాలేదు బరువుగానే ఉంది కూడా!

**కె ఎల్. ఎన్, విశాఖపట్నం**

అమ్మాయిలకు చెప్పతగ్గ విషయాలెక్కడ దొరుకుతాయి?

కుమారీ శతకంలో! [మీ ప్రశ్న సరిగ్గానే అర్థం చేసుకున్నానని భావిస్తున్నాను సార్!]

**ఎ. వి. ఆర్, మెలుపాక**

నేటి అసభ్యవస్త్రధారణపై మీవ్యాఖ్య?

అసభ్యమన్న పైపైటలు మీరే తగిలేశారుగా? మళ్ళీ నన్నెందుకు అడగడం?




## 2

'యింకా వెళ్ళిపోతాం అన్నయ్యా. యిక్కడ వుండి చేసేదేముంది ?' వచ్చిన నాలుగురోజులకే అంది అరుణ.

తన ముఖంలోకి భావయుక్తంగా చూస్తున్న భర్త వుద్దేశం గ్రహించి 'అప్పుడే వెళ్ళటం ఏమిటె అరుణా ? వచ్చి నాలుగురోజులయినా కాలేదు' అంటూ వారించింది లలిత.

మరో రెండురోజులు పోయాక భోజనాల దగ్గర 'మన ఊరు వెళ్ళిపోదాం నాన్నా. రేపు రాత్రి బస్సుకి వెళితే తెల్లారేసరికి వెళ్ళిపోతాం' అంది బలవంతంగా యిన్ని రోజులు వుండిపోయినట్టు.

'అక్కడకి వెళ్ళిచేసే పనేముందమ్మా ? యింకా హైద్రాబాద్ అంతా చూడనే లేదు. ఒక యిరవైరోజులుండి వెళ్ళ వచ్చులే' అన్నాడు సుధాకర్.

'నీ ఉద్యోగానికి నువ్వు పోతావు. పిల్లల పనులతో నాకు సరిపోతుంది. యింకా ఊరు చూసినట్టే. ఎందుకులే పోతాం.'

'నువ్వు చెప్పు' అన్నట్టు భార్య ముఖం లోకి చూసాడు సుధాకర్. లలిత ముఖం తిప్పేసుకుంది. కావలసినవి వడ్డిస్తూ మౌనంగా వుండిపోయింది.

'నాకు తీరకపోతే మీ వదిన చూపిస్తుంది లేమ్మా. పిల్లలు యింకా లలితకి అలవాటు కాలేదు' అంటూ బలవంతంచేసి ప్రయాణాం వాయిదా వేసాడు.

సెలవు రోజులలో నగరంలో చూడవలసిన వింతలూ విశేషాలూ అన్నీ చెల్లెలికీ తండ్రికీ చూపించాడు.

అంతకుముందే అవన్నీ భర్తతో కలిసి ఒకసారి చూడటంతో 'పిల్లలని నేను చూసుకుంటానులే. మీరు వెళ్ళిరండి' అంది లలిత.

'పిల్లలేం అడ్డు ? వదినకి మాతో రావటం యిష్టం లేదేమోలే' అదోలా అంది అరుణ.

చెల్లాయి ఏమనుకుంటుందో అని సుధాకర్ బలవంతం చేయటంతో తప్పనిసరిగా బయలుదేరవలసి వచ్చేది లలితకి. యిద్దరు చిన్నపిల్లల్ని ఎండలో తిప్పలుపెట్టి వాళ్ళని యిబ్బంది పెడుతూ, విసుక్కుంటూ ఊరంతా తిప్పి, అలసిపోయివచ్చి మళ్ళీ వంట చేయాలంటే చాలా చిరాకనిపించేది. అయినా; ఆడపడుచు ఎన్ని అర్థాలు తీసుకుంటుందో సుధాకర్ మనస్సు కష్టపెట్టుకుంటాడేమో అని అయిష్టంగానే వాళ్ళతో బయలుదేరేది.

'బస్సులు రావటం ఆలస్యమయితే 'టాక్సీ పిలిస్తే పోతుందిగా. కాళ్ళు పట్టుకుని పోతున్నాయి. అయినా రోడ్డు మీద వెర్రిమొహాలేసుకుని ఎంతసేపని నిలబడతాం అసహ్యంగా?' అనేది అరుణ.

హైద్రాబాద్‌వంటి పట్టణాలలో నగరం నలువైపులా నలుగురితో వెళ్ళి చూడటానికి బస్‌చార్జీలే చాలా ఎక్కువ అవుతాయి. మధ్య తరగతి కుటుంబంలో పుట్టి పెరిగి ఒక మారుమూల పల్లెటూరిలో వుండే అరుణ అడుగడుగునా టాక్సీ పిలవమని పురమాయిస్తూ ఎంతో క్లాస్‌గా వుండాలని తాపత్రయం పడటం చూస్తే లలితకి నవ్వు వచ్చేది.

మొదటిరోజు బయటకి వెళ్ళినప్పుడు చెల్లెలు కాళ్ళు నెప్పులనగానే టాక్సీ పిలిచి, పిల్లలు కావాలని అడిగినవల్లా కొనిపెట్టి యింటికి వచ్చాక పర్సులో మిగిలిన చిల్లర డబ్బులని దిగులుగా చూసుకుంటున్న భర్తని చూసి జాలిగా నిట్టూర్చి పెళ్ళిలో బంధువులు తనకి చదివించిన తాలుకు డబ్బు కొద్దిగావుంటే అది అతనికి యిచ్చింది.

నోరు తెరుచుకుని డబుల్ డెక్కర్ బస్సులనుండీ స్లీవలెస్ జాకెట్ వేసుకున్న యువతులవరకూ ప్రతిదీ ఆసక్తిగా చూస్తూ వ్యాఖ్యానించే అరుణ తిరిగి తిరిగి యింటికి రాగానే బట్టలయినా మార్చుకోకుండా చాప మీద వాలిపోయేది. భోజనం వడ్డించాలని లలిత పావుగంట దగ్గర నిలబడి నిద్రలేపి పదిసార్లు చెప్పవలసి వచ్చేది. వంట అయ్యేలోపలే నిద్రపోయి ఆకలితో అర్ధరాత్రిలేచి గోలచేసే పిల్లలని సముదాయించలేక సతమతమయిపోయేది లలిత.

పదిరోజులు అయ్యాక అరుణ ప్రయాణ సన్నాహాలు చేస్తూంటే లలిత వారించలేదు. మరో నాలుగురోజులు వుండమని మాట వరుసకయినా అనలేదని అన్నగారి దగ్గర నవ్వుతూ సాధిస్తున్నా చిని ఊరుకుంది.

అరుణ వంటి వాళ్ళని భరించటం కష్టం. ఎదుటి వాళ్ళు ఏ పని చేసినా తప్పులెంచటమే వాళ్ళ ఉద్దేశంలా కనిపిస్తుంది. తమ లోపాలని తెలుసుకోవాలని పొరపాటునయినా వాళ్ళు అనుకోరు.

అరుణకి చీరలు ఎక్కువలేవు. తనకెవరు

పెడతారంటూ నిష్ఠూరంగా యిదివరకు అనటం గుర్తుకి వచ్చి సుధాకర్‌ని అడిగింది 'అరుణకి చీర పెట్టవద్దూ?' అని.

'యిప్పటికే అప్పు చేసాను. యింకోసారి చూద్దాంలే' అంటూ విసుక్కున్నాడు.

తల్లిలేని పిల్ల. అందరిలోకి చిన్నది అని సుధాకర్‌కి ఎక్కువ అభిమానం. ఆడపడుచు ప్రవర్తన ఎలా వున్నా పుట్టింటి మీద ఆశ వుండటం సహజం. ఎప్పుడో డబ్బులు వున్నప్పుడు పెట్టటం వేరు. మొదటిసారి తమ సంసారం చూడటానికి వచ్చింది. యిప్పుడు పెడితేనే బావుంటుంది అన్న ఉద్దేశంతో తన సూట్‌కేస్‌లో యింకా మడత విప్పని రెండు నేత చీరలు వుంటే అవి తీసి కాస్త సంశయిస్తూనే అరుణని అడిగింది ఆ రెండిటిలో ఏది నచ్చుతుందో చూడమని.

అందులో ఒక చీర పెళ్ళిలో అత్తగారు వాళ్ళు పెట్టిందే. రెండో చీర పుట్టింటి తాలూకు ఎవరో పెట్టారు. ఆ చీర బార్డర్ మోటుగా వుందని అత్తగారు పెట్టిన చీర నచ్చుతుందేమో అని రెండూ చూపించింది.

'మేము పెట్టిన చీర నీకు నచ్చలేదా? మడత విప్పలేదు?' లలిత అనుకుంటూనే వుంది అరుణ అలాంటి మాట ఏదో అంటుందని.

'అయినా యిప్పుడీ చీరెలూ సారెలు ఏమిటి?' అయిష్టంగా ముఖం చిట్లించింది.

'అదేమన్నమాట తల్లీ. ప్రేమతో పెట్టినది తృణమయినా ఫలమయినా తీసుకోవలసిందే' ముసలాయన కూతుర్ని మందలిస్తున్నట్టు అన్నాడు.

అన్నగారి చేత ప్రతిమాలించుకున్నాక బలవంతంగా తీసుకుంటున్నట్టు అందుకుంది.

అంతకంటే మంచి చీర పెట్టలేదనా లేకపోతే తన చీర తీసుకోవటం ఏమిటనా అంత బెట్టుసరి అని ఆలోచనలో పడింది లలిత.

అంతవరకూ మౌనంగా వున్న సుధాకర్ బస్సు టికెట్లు రిజర్వు చేసి తెచ్చాక చెల్లెలు తండ్రీ అప్పుడే వెళ్ళటం ఏ మాత్రం యిష్టం లేనట్టు, యింకో పది రోజులయినా వుండకుండా వెళ్ళిపోతున్నందుకు ఎంతో బాధపడుతున్నట్టు మాట్లా



వాడు.

రాత్రి బయలుదేరే సమయానికి బాబ్జి నిద్రపోయాడు. మున్నీ అత్త తాత వెళ్ళి పోతున్నట్టు పసికట్టి తనూ వస్తానని మరాం చేస్తూ ఏడ్చింది. బుజ్జగిస్తున్న లలితకి పిల్లల బాధ్యత అప్పగించి రిక్షా ఎక్కారు తండ్రీ కూతుళ్ళిద్దరూ.

రిక్షా మలుపు తిరిగే వరకూ చూస్తూ నిలబడిన లలిత తేలికగా ఊపిరి పీలుస్తూ వెక్కిళ్ళు పెడుతున్న మున్నీని భుజాన వేసుకుని లోపలికి వెళ్ళి తలుపులు వేసుకుంది.

*　　*　　*

సుధాకర్ లేని సమయం చూసి పిల్లలిద్దర్నీ దగ్గరికి తీసుకుని 'చూడమ్మా, మున్నీ నన్ను అమ్మా అని పిలవాలి. పిన్నీ అని పిలవద్దు' అంది లలిత లాలింపుగా.

మున్నీ అయిష్టంగా తల అడ్డంగా ఊపింది 'మా అమ్మ లేదు. చచ్చి పోయిందిగా' అంది.

లలితకి ఏ మనాలో తోచలేదు. మున్నీ అలా అంటుందని అనుకోలేదు. తల్లి లేని పసివాళ్ళకి తను తల్లి స్థానంలో వచ్చింది. ఆ పసి మనసులలో తను అమ్మకాదు అనే భావం రానీయకూడదు. యింకో రెండేళ్ళు పోతే 'పిల్లలందరూ అమ్మా అని పిలుస్తారు. మరి మాకు అమ్మ ఏది?' అని

# లలిత

మున్నీ అడగవచ్చు. తను వాళ్ళని తన పిల్లలగానే చూసుకోబోతోంది. కనుక వాళ్ళకి సవతి తల్లి అనే భావం ఊహలో అయినా రాకుండా అమ్మా అని పిలవటం అలవాటు చేస్తేనే బావుంటుంది — అని ఆలోచిస్తూ 'అమ్మ లేదని ఎవరు చెప్పారమ్మా నీకు?' అంది లాలిస్తూ.

'అత్త చెప్పింది. మరి అత్త కొలుస్తుందని కూడా చెప్పింది. మరి నువ్వు కొడ్తావా?' బెరుకుగా చూస్తూ అమాయకంగా అడిగింది మున్నీ.

ఆ క్షణంలో అరుణ మీద ఎంతయినా కోపం వచ్చింది లలితకి. హైస్కూల్ వరకూ చదివింది. తెలుగు సినిమా నటిలా అలంకరించుకుంటుంది. కానీ మాటతీరు, చేసే పనులూ అన్నీ పాతకాలపు పల్లెటూరి పిల్లలానే చేస్తుంది అని విసుక్కుంది.

'అత్త నువ్వు అల్లరి చేస్తావని ఊరికే చెప్పిందమ్మా. నేనెందుకు కొడతాను? నువ్వూ తమ్ముడూ చాలా మంచివాళ్ళు కదూ మరి? చెప్పినమాట చక్కగా వింటారమ్మా. మంచి పిల్లలు' అని ఉబ్బేస్తూ 'నన్ను అమ్మా అని పిలిస్తే మరి బిస్కెట్లూ చాకలెట్లూ యిస్తాను' అని ఆశపెడుతూ ఊరించింది.

లలిత దగ్గర అప్పటికే కొన్ని అలవాటుపడిన బాబ్జి వెంటనే చెయ్యిచాచాడు. 'అమ్మా అంతాను. మలి చాకలెత్తు...'

'నువ్వు బంగారుబాబువి నాన్నా' అంటూ ఎత్తుకుని ముద్దు పెట్టుకుంది.

తమ్ముడి ఒక్కడికే చాకలెట్లూ బిస్కెట్లూ పెట్టేస్తుందేమో తన కసలే యివ్వదేమోనన్న భయంతో 'నేనూ అమ్మా అంతాను' అంది మున్నీ అయిష్టంగానే.

'అమ్మా' అని పిలవటం కొత్తగా ఉత్సాహంగా వుందేమో 'అమ్మా అమ్మా' అంటూ లలిత చీర కుచ్చెళ్ళు పట్టుకుని లాగుతూ నవ్వాడు బాబ్జి.

మున్నీ బిస్కెట్లు తింటూ ఒకమూలకెళ్ళి కూర్చుంది. కొద్దిగా జ్ఞానంవచ్చిన ఆ పిల్ల తనకసలు అమ్మ లేదని ఆలోచిస్తోందని గ్రహించి నెమ్మదిగా దగ్గరకెళ్ళి యింకో చాకలెట్టు యిచ్చి చిన్నప్పుడు చదివిన చందమామలో కథలు గుర్తు తెచ్చుకుంటూ మున్నీకి చెబుతూ తనే అమ్మ అని ఆ పసిహృదయం నమ్మేలా విశ్వప్రయత్నం చేసింది.

సుధాకర్ వస్తూనే పిల్లలు 'అమ్మా' అని పిలవటం విని ఆశ్చర్యపోతూ లోపలికి వచ్చాడు.

యిద్దర్నీ చెరో వైపునా కూర్చోబెట్టుకుని వాళ్ళకేదో కథ చెబుతోంది లలిత. మధ్య మధ్య చిన్నారి సందేహాలతో ఏమిటో అడుగుతోంది మున్నీ. బాబ్జి బుద్ధిగా లలితవళ్ళో కూర్చుని చేతి గాజులతో ఆడుకుంటున్నాడు.

విస్మయానందాలతో చూస్తూ నిలబడి పోయిన భర్తని చూసి సిగ్గుతో తల వంచేసుకుంది.

'అదృష్టం నీరూపంలో నన్ను వెదుక్కుంటూ వచ్చింది లలితా' ఆనందంతో మరి గొంతు పెగలలేదు. నిండు సంతోషంతో కృతజ్ఞతా పూర్వకంగా చూస్తూ ఆప్యాయంగా దగ్గరికి తీసుకున్నాడు.

'ష్. పిల్లలు' మృదువుగా వారించింది లలిత.

'నాన్నా...యిది అమ్మ' లలితని చూపిస్తూ ఏదో కొత్త విషయాన్ని కని పెట్టినవాడిలా అమాయకంగా, నవ్వాడు బాబ్జి.

'నీ ఋణం నేను తీర్చుకోలేను లలితా...'



యింకా ఏదో అనబోతున్న భర్తని చిరునవ్వుతో వారించింది.

'మన మధ్య వుండవలసింది కృతజ్ఞత కాదు అనురాగం. అయినా యిందులో నేను చేస్తున్న ఘనకార్యం ఏముంది? నా సంసారాన్ని నేను చక్కదిద్దుకుంటున్నాను. నా పిల్లలూ నేనూ...' అరుణిమ దాలుస్తున్న చెక్కిళ్లని తదేకంగా చూస్తున్న సుధాకర్ లలితని యింకా మాట్లాడనీయలేదు.

అతని చేతుల్లోనుండి తప్పించుకుంటూ 'యింకా వంట మొదలుపెట్టలేదు' అంటూ వంటగదిలోకి వెళ్ళిపోయింది నవ్వుకుంటూ.

ఆ రాత్రికి ఎంతకీ నిద్రపట్టలేదు లలితకి. ప్రశాంతంగా నిద్రపోతున్న సుధాకర్ని నిద్రలో చిరునవ్వుల్ని చిందిస్తున్న పిల్లలనీ తృప్తిగా చూస్తూ ఆలోచిస్తూ పడుకుంది.

విస్మయానందాలతో అనురాగం తొణికిసలాడుతున్న చూపులతో తన కళ్ళల్లోకి ఆరాధనా భావంతో చూస్తూ మాటలలో వ్యక్తీకరించలేని కృతజ్ఞతతో ఆప్యాయంగా దగ్గరికి తీసుకోవటం— ఆ అందమైన అనుభూతి సజీవంగా నిలిచిపోయినట్లనిపించింది.

అమాయకంగా అమ్మా అని పిలుస్తూ ఆనందంతో పిల్లలు గంతులు వేయటం గుర్తుకి వచ్చి హాయిగా తృప్తిగా గర్వంగా నవ్వుకుంది లలిత.

అరుణ రాకతో సుధాకర్లో వచ్చిన మార్పుని చూసి దిగులుపడిన లలిత చాలా రోజుల తర్వాత గుండెలు నిండిన సంతోషంతో సుధాకర్కి దగ్గరగా జరుగుతూ 'మీరు కాదు. నేనూ అదృష్టవంతురాలినే' అనుకుంది తృప్తిగా కనురెప్పలు మూసుకుంటూ.

* * *

'ఈనెల ఎలా జరుగుతుందో ఏమిటో అర్థంకావటం లేదు లలితా. చెల్లాయి వాళ్ళు వచ్చినప్పుడే మా శేఖర్ దగ్గర అప్పు తీసుకున్నాను. యిప్పుడెవరిని అడిగేది? ఎవరిస్తారు? జీతం వచ్చి పది రోజులయినా అవకుండానే అంతా ఖర్చు అయిపోయి పర్సులో మిగిలిన రూపాయి నోట్లని దిగులుగా చూశాడు సుధాకర్.

తను ఉద్యోగం చేయవలసిన అవసరం ఎంత వుందో అర్థం చేసుకున్న లలిత మరేమీ మాట్లాడలేదు. విని ఊరుకుంది.

మరో నాలుగురోజులకి యింట్లో పని మనిషి కాకుండా యింకో కొత్త పనిపిల్ల కూడా తిరుగుతూ పనిచేస్తూ వుండటం చూసి సుధాకర్ అనుమానంగా అడిగాడు ఆపిల్ల ఎవరని

'పిల్లలిద్దరినీ చూసుకుంటుందని పెట్టాను' భర్త ముఖంలోకి పరిశీలనగా చూస్తూ చెప్పింది లలిత,

అతని ముఖంలో గబగబా రంగులు మారిపోయాయి. ఏదో అనబోయి ఆగిపోయి తిరస్కారంగా చూసి బయటకి వెళ్ళిపోయాడు.

లలిత మనస్సు చివుక్కుమంది. చాలీ చాలని జీతంలో యిద్దరు పనిమనుషులని ఊరికే యింట్లో కూర్చుని తను పెట్టుకుంటుందని అతను ఎలా అనుకున్నాడో అని నిట్టూర్చింది.

మరుసటిరోజు సాయంకాలం సుధాకర్ ఆఫీసునుండి యింటికి వచ్చేసరికి తాళం వేలాడుతోంది బయటి గదికి. పనిపిల్ల ముందువున్న చిన్న వరండాలో కూర్చుని పిల్లలతో ఆడుకుంటోంది ముందు చెప్పకుండా పిల్లలని బయట పడవేసి అంత అర్జెంటుగా వెళ్ళవలసిన అవసరం ఏమిటో? అయినా లలితకి హైదరాబాద్

# లలిత

కొత్త. ఒంటరిగా ఎప్పుడూ బయటకి వెళ్ళలేదు. ఏ బస్సు ఎక్కడికి వెళ్తుందో కూడా సరిగ్గా తెలియదు. యిక్కడి వీధుల పేర్లకి యింకా అలవాటు పడలేదు. ఎక్కడికి వెళ్ళిందో! ఆలోచిస్తూ పని పిల్లని అడిగాడు.

'ఏడికి పోయిందో నాకు ఎరికలేదు పొద్దుగాలనే పోయిందయ్యా' అంది ఆ పిల్ల ఆటలమధ్య లేచి నిలబడుతూ.

'మరి పిల్లలు? వాళ్ళకి తిండీ అవ్వలు ఏమీ అక్కర్లేదా?' కోపంగా అడిగాడు.

'బువ్వ కలిపి గిన్నెలో పెట్టిపోయింది. మధ్యాన్నం యిద్దరికీ పెట్టిన. ఏడితే పెట్టమని బిళ్లలు యిచ్చి పోయింది అయ్యన్నీ అమ్మకీ అయ్యకి పెట్టిన' బెరుకుగా చూస్తూ చెప్పింది.

నోట్లోవున్న బిళ్ల నమలలేక మింగాలేక ఆ పిల్ల పడే బాధంతా గమనిస్తూనే వున్నాడు సుధాకర్. పిల్లలకి అసలు పెట్టిందో అన్నీ తనే తినేసిందో అన్న అనుమానం వచ్చింది. అయినా లలితకి షికార్లు ఏమిటి? అదే పార్వతి అయితే తను లేకుండా బయటకి వెళ్ళగలదా? తనని అడగకుండా వెళ్ళవలసినంతటి రాచకార్యాలు ఏమిటో! కూర్చోవటానికి కుర్చీ అయినా లేకపోవటంతో అతనికి కోపం




వచ్చింది. యింటికి రాగానే అర్థాంగి అందించే వేడివేడి కాఫీ టిఫినూ లేకపోవటంతో ఆకలి చిరాకూ కలిసి విసుగ్గా పచార్లు చేస్తూ లలిత వస్తుందేమో అని చూస్తూ అయిదు నిముషాలు అయిదు యుగాలలా గడిపాడు. బాబీ క్రింద మట్టిలో పడిన చాకలెట్ కాగితం నోట్లో పెట్టుకోవటం చూసి వీపుమీద ఒకటి అంటించాడు. వాడు ఆరున్నొక రాగాలు ఆలపిస్తూంటే చూస్తూ నిలబడిన పని పిల్లని 'ఏం చూస్తున్నావు? ఎత్తుకుని బయటకి తీసుకుపో' అంటూ కసురుకున్నాడు.

మున్నీ భయంగా తండ్రివైపు చూస్తూ ఆ పిల్ల లంగా పట్టుకుని వెనుకే వెళ్ళింది. యింకో అయిదు నిముషాలు చూసి చిరాకుగా బయటకి వెళ్ళిపోతూండగా లలిత బాబీని ఎత్తుకుని రావటం కనిపించింది. ఏవో ఖబుర్లు చెబుతూ వెనుకే మున్నీ వస్తోంది. పనిపిల్ల కూడా హుషారుగా ఉదయంనుండి పిల్లలిద్దరూ ఎంత అల్లరి చేసారో, తనెలా ఆడించిందో వర్ణించి చెబుతోంది. అంతవరకూ నిశ్శబ్దంగావున్న యిల్లు లలిత రాకతో కళకళ లాడింది.

పర్సులోనుండి తాళం చెవులు తీసి అందిస్తూ 'ఉద్యోగం వచ్చింది' అని ఉత్సాహంగా చెప్పింది లలిత.

కోపంగా ఏదో అనబోతున్న సుధాకర్ నమ్మలేనట్టు ఆశ్చర్యంగా చూసాడు.

'ముందు తాళం తీయండి. ఒక గ్లాసు మంచినీళ్లు తప్ప యింకేమీ తీసుకోలేదు ఉదయంనుండి. చాలా నీరసంగా వుంది' అంది లలిత నిలబడలేక గోడకి ఆనుకుంటూ.

'యింకా నయం. తొందరపడి ఏమీ అనలేదు' అనుకున్నాడు సుధాకర్ అలసిపోయిన భార్యని జాలిగా చూస్తూ.

స్టౌ అంటించి కాఫీకి నీళ్ళుపెట్టి అవి మరిగే లోపల కాస్త విశ్రాంతి తీసుకుంటూ అనుకోకుండా తను ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజికి వెళ్ళటం గురించి చెప్పింది.

ఎదురింటి వాళ్ల అమ్మాయికి యింటర్వ్యూకి కార్డు వచ్చింది వెళుతోంది అని ప్రక్కింటావిడ ఎవరితోనో చెప్పటం విని

ఆ అమ్మాయిని వివరాలు కనుక్కొని ఆదరా బాదరాగా పెట్టెడుగున పడి వున్న సర్టిఫికెట్లు అవి తీసుకుని పిల్లలకి కావలసినవన్నీ పనిపిల్లకిచ్చి జాగ్రత్త అవి వదిపార్లు హెచ్చరించి భోంచేస్తూ కూర్చుంటే ఆ అమ్మాయి విసుక్కుంటుందేమో అని అడుగున మిగిలిన ఉప్మా రెండు ముద్దలు తిని వెళ్ళిపోయింది. అదృష్టవశాత్తూ పేరు రిజిష్టరు చేసుకోగానే ఒక యింటర్వ్యూ వుంది వెళతారా అని అడిగాడు ఆఫీసరు. ఎదురింటి వాళ్ళ అమ్మాయిని మరో ఆఫీసుకి పంపించారు యింటర్వ్యూకి ఒంటిగంట వరకూ అక్కడే పడిగాపులు పడి వాళ్ళిచ్చిన లిస్ట్ తీసుకుని మరో యిద్దరు అమ్మాయిలతో కలిపి ఆఫీసు వెదుక్కుంటూ వెళ్ళారు. లంచ్‌కి బయటికి వెళ్ళిన సూపరింటెండెంటూ క్లర్కులూ అలస్యంగా వచ్చారు వచ్చిన అరగంటకి యింటర్వ్యూ తీసుకోవటం ప్రారంభించారు పదమూడు మందిలో చివర పేరు లలితది. అనుభవం వుండటంతో తనకి ఉద్యోగం వస్తుందేమో అన్న ఆశ ఒకవైపు, రికమెండేషన్ వున్న వాళ్ళు వుండే వుంటారన్న భయం మరో వైపు. ఆలోచనలతో సతమతమవుతూ కూర్చుంది. యింకోగంట ఆగితే అప్పుడే ఎవరు సెలక్ట్ అయ్యిందీ చెబుతామని వాళ్ళు అనటంతో సంకోచిస్తూనే ఆ గంట కూర్చుంది. రికమెండేషన్ వున్న ఒక అతన్ని, లలితని సెలక్ట్ చేసుకున్నారు మర్నాడు ఉదయమే వచ్చి ఆర్డర్స్ తీసుకుని సాధ్యమైతే వెంటనే జాయినవ్వమని చెప్పారు.

ఉద్యోగం రావటం ఎంతో కష్టంగా వున్న ఈ రోజుల్లో అనుకోకుండా అంత తేలికగా తనకి ఉద్యోగం రావటం ఎంతో సంతోషాన్ని కలిగించింది లలితకి ఆ ఆనందంలో ఉదయం నుండి తిరిగిన అలసట నీరసం కూడా కనిపించలేదు. కాఫీలు పని కాగానే పావు గంట విశ్రాంతి తీసుకుని పిల్లలని స్నానం చేయించి తిరిగి వంట పనిలో మునిగిపోయింది.

ఆ రాత్రి నిద్రపోయే వరకూ భార్య వెనుకే కావలసినవన్నీ అందిస్తూ పనిలో సాయం చేస్తూ లలితని పొగుడుతూ ఆశ్చర్యపోతూనే వున్నాడు సుధాకర్.

'నేను ఉద్యోగం కోసం ఎన్ని నెలలు ఆ ఎంప్లాయిమెంటు చుట్టూ ప్రదక్షిణలు చేశానో తెలుసా లలితా? తిరిగి తిరిగి విసుగు వేసేది. పల్లెటూరికి పోయి వ్యవసాయం చేసుకుంటే హాయిగా బ్రతక వచ్చని ప్రయాణం కూడా అయ్యాను. శేఖర్ కొప్పడి ఆపాడు. ఎలాగో తంటాలు పడి వాళ్ళనీ వీళ్ళని పట్టుకుని చివరికి యిప్పించాడు. అలాటిది నీకు ఎంత తేలికగా దొరికింది? అసలిప్పుడు ఉద్యోగాలు దొరకటం మరీ కష్టమైపోయింది. ఎంత చిన్న ఉద్యోగం అయినా పెద్ద పెద్ద ఆఫీసర్ల రికమెండేషనులు కావలసి వస్తోంది. ఆ ఎక్స్ఛేంజ్‌లో చూశావా? ఎంతోమంది బారులు తీర్చి వుంటారు, పేరు రిజిస్ట్రేషన్ చేయించుకోవటానికి. ఆ తర్వాత ఎన్నోనెలలు కొందరు దురదృష్టవంతులు సంవత్సరాల తరబడికూడా వాటి చుట్టూ ప్రదక్షిణ చేస్తూనే వుంటారు. అటువంటిది రిజిస్ట్రేషన్ చేసుకోగానే యింటర్వ్యూకి పంపటమే ఆశ్చర్యం పోనీ పంపారనుకో. అంతమందిలో నువ్వు సెలెక్టు కావటం అదృష్టం. సామాన్యంగా అప్పుడే రిజల్ట్ చెప్పరు ఏ సంగతీ తెలియపరుస్తామంటూ యింటి అడ్రసు తీసుకుంటారు. అలాంటిది నీకు అప్పటి కప్పుడు సెలెక్ట్ అయ్యావని చెప్పి మర్నాడే వచ్చి ఆర్డర్స్ కూడా తీసుకోమన్నారంటే ఎంత ఆశ్చర్యం?' అంటూ లలితకంటే ఎక్కువగా సంతోషపడి పోయాడు.

'మధ్యలో ఏ హోటలుకయినా వెళ్ళి కాస్త టిఫిన్ తీసుకో గూడదూ? ఎంత నీరసపడి పోయావో చూడు. చదువుకుని ఉద్యోగాలు చేస్తూ కూడా యింకా ఒంటరిగా హోటలుకి వెళ్ళాలంటే భయం అంటే ఎలా? అవసరం కొద్దీ వెళతారు కాని సరదాగా ఎవ్వరూ ఒక్కళ్ళే వెళ్ళరుకదా' అంటూ మందలించాడు.

'ఆర్థికంగా ఎలాంటి యిబ్బందులూ లేకుండా మనం హాయిగా బ్రతకవచ్చు కదూ లలితా? వచ్చేనెలలో మా వాడి అప్పు తీర్చేద్దాం. నీపేర సేవింగ్స్ ఎకౌంటులో ప్రతినెలా కొంత వేద్దాం' భవిష్యత్తు గురించి ఆలోచిస్తూ పడుకునే ముందు ఉత్సాహంగా అన్నాడు.

తన ఆలోచనలని కోరికలని అరమరికలు లేకుండా విప్పిచెబుతూ కొంగు వదలకుండా తిరుగుతున్న సుధాకర్ కూడా బాబీలా పసివాడిలానే అనిపించాడు లలితకి.

'బ్యాంక్‌లోన్ తీసి యిల్లు కడతాంలే. ఊరుకోండి' అంది పసివాడి అమాయకత్వానికి నవ్వుకునే తల్లిలా.

'ఎప్పటికయినా కట్టుకోలేక పోతామా ఏమిటి? మనం రిటైర్ అయ్యేలోపల లోన్ తీసుకున్నయినా సరే ఒక యిల్లు కట్టుకుందాం' అన్నాడు.

ఆ రాత్రి పదకొండు గంటలవరకూ యిద్దరూ ఖబుర్లు చెప్పుకుంటూ సరదాగా గడిపినారు మరుసటి రోజునుండి ఉదయం తనెప్పుడు నిద్రలేవాలో పనులన్నీ ఎలా చక్కబెట్టుకుని ఆఫీసుకి వెళ్ళాలో ఆలోచిస్తూ నిద్రపోయింది

(ఇంకా ఉంది)



# దైవ సంకల్పం

## ధర్మపథం



ఋణాసు వెంకటరమణయ్య

[illegible] కాదు, [illegible] యిత్తరులు చేయించే పనిగాని — సమస్తమూ దేవుని సంకల్పం వల్లనే జరుగుతున్నదనీ, దేనికిన్నీ మనం కర్తలం కామనిన్నీ గ్రహించి విహిత కృత్యాలు చేస్తున్నవారిని సర్వదా భగవంతుడే కాపాడగలడు. ఇట్టి విశ్వాసం ఉన్నవారికి ఎట్టి కష్టమూ కలగదు. స్వప్రయత్నం లేకుండానే ఆపదలన్నీ తొలగిపోగలవు. అందువల్ల మనం ఏది జరిగినా అది భగవత్సంకల్పమనే విశ్వసించాలి.

ఒక గ్రామంలో రామభక్తుడు — ఒక సాలెవాడు ఉన్నాడు. అతడు నూలు కొని తెచ్చి బట్టలు నేసి, వాటిని వర్తకులకు అమ్మి జీవించేవాడు. ఇంటింటికి పోయి వస్త్రాలు అమ్ముకోడానికి అతనికి తీరిక లేదు. ఏమాత్రం అవకాశం వున్నా శ్రీరాముణ్ణి ధ్యానిస్తూ వుంటాడు. అతడు బట్టల మూటలను పట్నానికి తీసుకొని పోయి అమ్ముకుని రాత్రి తన వూరు చేరుకునేవాడు.

బట్టలు అమ్మేటప్పుడు 'నూలుకు ఇంత అని శ్రీరాముని సంకల్పం నేతకూలి యింతని శ్రీరాముని సంకల్పం మొత్తం మీద బట్టకు ఇంతని శ్రీరాముని సంకల్పం' అని న్యాయమైన వెలనే చెప్పేవాడు. అతని స్వభావం ఎరిగిన వర్తకులు మారుమాట ఆడకుండా అతడు చెప్పిన వెలనే యిచ్చేవారు

ఒకనాడు అతడు పట్నంలో బట్టలు అమ్ముకొని తిరిగి వస్తూవున్నప్పటికి చాలా చీకటి పడింది. ఇంతలో కొందరు దొంగలు ఒక ధనపేటిని ఎక్కడో దొంగిలించి తెస్తూ, ఆ సాలెవాని తలపైని పెట్టి తమ వెంట రావాలని నిర్బంధించారు. అలా జరగడం శ్రీరాముని సంకల్పమే అనుకుని వాళ్లు చెప్పినట్లే చేశాడతను. దొంగతనం జరిగినట్లు తెలిసిన వెంటనే రక్షకభటులు నలుమూలలకూ పరుగెత్తారు, వాళ్లను పట్టుకుందామని. ఆ రక్షకభటుల్ని దూరం నుంచే చూసి, భయపడి దొంగలు పారిపోయారు. రక్షకభటులకు డబ్బుపెట్టెతో సాలెవాడు చిక్కాడు. అతడే దొంగ అని తలచి, చెరలోవుంచి, ఈ విషయం న్యాయాధికారికి తెలియజేశారు.

ఈ సమాచారం ఊరంతా పొక్కిపోయింది. ఉత్తమ పౌరునికి కలిగిన యీ కష్టానికి విచారించి, జనులంతా గుంపుగా న్యాయాధికారి వద్దకు పోయి, ఆ చేనేత పారిశ్రామికుడు చాలా ఉత్తముడనీ, దొంగిలించే స్వభావం అతనికి లేదనీ, ఆ పెట్టెను అతను అపహరించి వుండడనీ, వెంటనే విడుదల చెయ్యాలనీ కోరారు.

న్యాయాధికారి దోషిని పిలిపించాడు. సాలె ఉత్త అమాయకుడని అతనికి తోచింది. 'ఏమి జరిగిందో, జరిగినట్లు చెప్పు' అని అతడు ప్రశ్నించాడు. సాలెవాడన్నదిది — 'అయ్యా! నేను పట్నంలో పని చూచుకుని చీకటి పడిన తర్వాత వస్తూవుండగా, కొందరు ఆ పెట్టెను నా నెత్తిపై పెట్టి తమతో రావాలని నిర్బంధించారు. అది శ్రీరాముని సంకల్పమని, వారు చెప్పినట్లు చేశాను. శ్రీరాముని సంకల్పం అలా వుండబట్టే రక్షకులు నన్ను పట్టుకోవడం దొంగలైన వ్యక్తులు పారిపోవడం జరిగింది. శ్రీరాముని సంకల్పంవల్లనే నేను చెరలో ఉంచబడడమూ, మీరు నన్ను పిలిపించడమూ జరిగింది. జరిగినదానికీ, జరగబోయే దానికీకూడా శ్రీరాముని సంకల్పమే కారణం' అని వినయ విధేయతలతో తెలియజేశాడు. యదార్థాన్ని గ్రహించి న్యాయాధిపతి అతన్ని విడుదల చేశాడు.

తర్వాత గ్రామస్థులు అతని ఆపత్కు విచారాన్ని తెలుపుతూ, విడుదల పొందినందుకు ఆనందించారు. అతడు 'ఇందులో విచారానికీ, అభినందనలకీ అవకాశం లేదు. నేను కష్టపడాలని శ్రీరాముని సంకల్పము కనుక కష్టపడ్డాను. నేను విడుదల పొందడం శ్రీరాముని సంకల్పం గనుక మీ రందరూ వచ్చి నన్ను విడిపించారు' అని అన్నాడు ●



ఆరని కలహాన్ని సృష్టించింది. ప్రతి విషయానికి తానే పెద్దరికం పుచ్చుకునేది.

అన్నకు; వదినపైన లేనిపోనివన్నీ కల్పించి చెబుతూండేది. ఆమె ప్రేమతో పిలిచినా 'అదుగో! చూడన్నాయ్! ఏమండీ అని పిలవక ఎలా గర్వంగా పిలుస్తుందో!' అనేది.

'చూడన్నాయ్! పుట్టింటి నుంచి వచ్చిందిగదా! చీరలూ, పిల్లలకు చొక్కాలూ అవీ అక్కడే కుట్టించి తెచ్చుకోకుండా వచ్చింది. ఇక్కడయితే మన డబ్బుతో కొనవచ్చుని గబోలు!' అని ఓసారి హెచ్చరించేది.

'అయినా నువ్వేం సుఖపడుతున్నావురా! అన్నాయ్?! మాట్లాడితే అమ్మగారింటికి వెళ్తుందా మహారాణి! మహాతల్లి! ఈవిడ ఏమిటి? పిల్లల్ని కనేది?! లోకంలో ఎంత మంది లేరు?! అంతా నాటకం? వేవిళ్లా లేపు జీలకర్రా లేదూ!' అంటూ మరోసారి మంధరత ప్రాధరించేది. చెప్పుడు మాటలు వినే ఆ అన్నయ్య 'నిజమే'నని నమ్మేవాడు. అయినా వెయ్యగా వెయ్యగా పది రాళ్లలో ఓ రాయైనా తగుల్తుందన్నట్లు చెప్పగా చెప్పగా ఓ మాటైనా ఆ అన్నగారి చెవి దూరి పోరాడేది. అక్కడితో ఆ భార్యభర్తల మధ్య అపార్థాలూ, కలహాలూ - ఆరంభ మయ్యేవి.

'మొన్న పక్కయింటివాళ్లతో విన్ను తిడుతూ ఏదో చెబుతోందన్నాయ్! నిన్న నువ్వు భోజనానికి రాకముందే 'వస్తే వస్తాడు లేకపోతే లేదు నాకెందుకు' అంటోంది. అమ్మను 'నీకెందుకు?' అని విదిరించి మాట్లాడింది' అంటూ అబద్ధాల్ని అందంగా పేర్చి అన్నయ్యకు బహూకరించుతూండేది.

ఆమె ఆరని కలహానికి ఆజ్యం పోసింది. దానితో కొన్నాళ్లు ఆ ఆలూమగలు మాటా మంచీ లేకుండా దూరంగా వుండిపోయారు. అన్నాళ్లూ అన్నగారి సంపాదనంతా చెల్లెలికే చెల్లించడమయ్యేది.

పైగా 'పిల్లలున్నారు! అదేమిటమ్మా!?' అని ఎవరైనా అంటే విరుచుకుపడేది రాక్షసిలా. 'ఏం? వాళ్లు తినబుట్టలేదు! నా అన్నసొమ్ము నేనే తింటాను. నాన్నా! అని వాళ్లు వచ్చిననాడే పెడతాడు మా అన్నయ్య! అయినా వాడికేం ఖర్మ? మగవాడు! మహారాజులా మరో యిల్లాల్ని దెచ్చుకుంటాడు' అనేది.

ఆవిధంగా విడిపోయిన ఆ భార్యాభర్తలు రెండు సంవత్సరాలపాటు బద్ధవిరోధులుగా వుండిపోయారు.

'నువ్వూ స్త్రీగా పుట్టావుగదా! అరుణా! నీకూ భర్తా, పిల్లలూ సంసారం వుంటుంది. ఆ రోజున మరో స్త్రీ యిలా చేసినపుడు నీమనస్సెలావుంటుంది? సాటిస్త్రీని అంతమాత్రం అర్థంజేసికోలేని నీ హృదయం నిజంగా ఎంత కఠినమైందనుకోవచ్చునో?! అసలు నీకు హృదయమంటూ ఒకటి వున్నదా అని నా అనుమానం' అంటూ ఆమె వదిన ఎన్నోసార్లు హెచ్చరించేది.

అయినా ఆ మంధరకు అవి చెవికెక్కిన క్షణమే లేదు. ఆపైన మరింత కక్షతో యింకా ఎన్నో కల్పించి అన్నా వదినలను విడదీయగలిగినంత సాహసానికి పూనుకుంది. అందుకే చుట్టుప్రక్కలవాళ్లకు అరుణ అంటే ఎంతో భయం. ఆమెతో మాట్లాడినంతసేపూ జాగ్రత్తగా వుండేవాళ్లు.

'అమ్మో! అరుణేనా! కాస్త జాగ్రత్తగా వుండాలమ్మోయ్ వదినా! ఆపిల్లతో. సంసారాల్ని నాశనం జేస్తుందా మహాతల్లి! ఏమాత్రం నోరుజారినా మన పనిగోవిందా! గంగలో కలిసినట్టే మన కాపురాలు' అనుకునేవాళ్లు యిరుగు పొరుగువాళ్లు అరుణ ప్రసక్తి వచ్చినపుడు. ఆ సంగతి తెలిసే మేనమామకొడుకుకూడాచేసుకోనన్నాడు. దూరంగా వుండడం మూలాన 'పెళ్లి'లోని సారధి మెడకు గుదిబండలా తయారైందామె.

(ఇంకా వుంది)

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర పత్రిక వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥



# వారఫలం

## 28-11-1969 శుక్రవారం మొదలు 4-12-1969 గురువారం వరకు

**మేషం:** సామాన్యమైన పనులకు కూడా యెంతో కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు లాభిస్తాయి. సాటివారితో మాట పట్టింపులు తగవు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవ కార్యాలు నెరవేరుతాయి.

**వృషభం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది.

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మిధునం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కర్కాటకం:** వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం:** కొన్ని వ్యవహారాల్లో మీరు అనవసరమైన శ్రమ పొందగలరు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కన్య:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు.

స్త్రీలకు:— పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు బాగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు:— బంధుమిత్రులను కల్సుకొంటారు. విలాస వస్తువులు కొంటారు.

**ధనుస్సు** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**మకరం** ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. వారం మధ్యలో ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలోకి మెప్పుకురాని కార్యభారాన్ని సహిస్తారు. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితులు యేర్పడతాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కుంభం:** వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది. ప్రయాణాలోచనలు చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. వారం ఆఖరులో మీరు ప్రయోజనంలేని శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగానే ఉంటుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**మీనం:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాటివారితో మాట పట్టింపులు తగవు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

—మహేష్



15
సార్లు
లండనుకు
LONDON
మరియు 7 సార్లు న్యూయార్కుకు
IATA
50 సంవత్సరాల
ప్రపంచ వైమానిక
సహకారం.
ఎయిర్-ఇండియా
బి.ఓ.ఎ.సి మరియు క్వాంటాస్‌వారి సౌజన్యంతో

# కన్నెపిల్ల

సి.వి.ఆర్.యస్. బాలామణి



కన్నెపిల్ల కమ్మని కలల్లా పరుగెడుతున్నాయి విశాల గగనంలో వెండిమబ్బులు. అంతలోనే ఓర్వలేని కారుమబ్బులు వెండి మబ్బుల్ని కమ్మేసాయి. చక్కగా సింగారించుకుని సిగ్గుతో నిల్చున్న ప్రకృతి కన్య భయకంపితయ్యి భోరున ఏడ్వసాగింది. ఆమె సింగారమంతా పోయి నానా భీభత్సంగా ఉంది. నిజానిజాలు తెలియక కారుకూతలు కూసే లోకంలాగ భీకరంగా ఉరిమింది ఉరుము.

ఆ కుంభవృష్టిలో ఇంటికి వెళ్లలేక, స్నేహితురాలింట్లో కూర్చోలేక సతమత మవుతోంది జయలలిత.

'ఎలాగే ఉషా? చీకటి పడిపోతూంది. ఆలస్యంగా వెళ్తే మా అమ్మగారు కోప్పడ తారే.' అంది ఆందోళనగా ఏనుగు తొండాల్లాంటి వర్షపు ధారలను చూస్తూ జయలలిత.

'ఈ వర్షంలో ఎలా వెళ్తావే జయా? మీ అమ్మగారు మటుకు ఏమంటారేమిటి? మా ఇంటికేగా నీవు వస్తా.' అంది ఉషశ్రీ మందలింపుగా.

'ఇంతలోనే వర్షమొచ్చేస్తుందనుకోలేదు.' బెంగగా అంది జయ.

'ఈ జీవితమింతేనే జయా! క్షణంలో ఏమౌనుందో మనకు తెలియదు. ఇందాకటి వరకూ మనోహరంగా ఉన్న వాతావరణం ఇప్పుడెలా మారిపోయిందో చూసావా? ప్రతిదీ తన ప్రతిభేనని విర్రవీగే ఈ మానవుల్ని చూసి జాలిపడాల్సిందే.' వేదాంత ధోరణిలో అంది ఉషశ్రీ. ఆ స్నేహితురాళ్లిద్దరూ ఏన్నో చర్చించుకున్నారు. పరసోక్త లాడుకున్నారు. కిలకిల మన్నారు. వారి కిలకిల నవ్వులు విందామని ముచ్చట పడిన వరుణ దేవుడు సరిగా వినబడవేమోనని వర్షపుజోరు తగ్గించాడు.

ఉషతో మాట్లాడుతోందన్న మాటేగాని ఒకప్రక్క అమ్మ ఏమంటుందోనన్న భయం పీడిస్తోంది జయని.

'హమ్మయ్య! ఇక వెళ్తానే ఉషా!' అంటూ లేచింది జయ.

'ఏవరేనా ఎత్తుకు పోగలరు జాగ్రత్త!' నవ్వుతూ సాగనంపింది ఉష.

చలిగాలి చక్కిలిగింతలు పెడుతూంటే, సన్నని వర్షపు తుంపరలకి శరీరం పులకిత మవుతూంటే, తీయని అనుభూతులకి లోనవుతూ, బెదురు చూపులతో, దడదడలాడే హృదయంతో, తడబడే అడుగులతో ఎడంచేత్తో పుస్తకాలు పుచ్చుకుని, కుడిచేత్తో మధ్య మధ్య పయిట సవరించుకుంటూ నడుస్తోంది కుందనపు బొమ్మలాంటి కన్నెపిల్ల జయలలిత.

'చిటపట చినుకులు పడుతూ ఉంటే, చలికాడే సరసన ఉంటే' జయలలితకేసి ఓరగా చూస్తూ వెకిలిగా నవ్వుతూ పాట లంకించుకున్నాడు ఒక రోడ్డుసైడు రోమియో.

జయలలిత నడక వేగం పుంజుకుంది.

'ఛీ! మానర్‌లెస్ బ్రూట్స్! ఎంత చదువుకున్నా ఒకటే. ఆడపిల్ల కనబడితే చాలు, ఆఖరికి రిక్షావాడుకూడ కవిత్వం (బజారు) ఒలకపోస్తాడు. ఆడది ఒంటరిగా రోడ్డుమీదకు రావడమే భయం. కాస్త చనువుగా మాట్లాడితే విపరీతార్థాలు తీస్తారు. రమానాథ్ తనకు పెద్ద ప్రేమలేఖ వ్రాసాడు. పిచ్చివెధవ! లెక్చరరు నిరంజనం తను సరదాగా నవ్వుతూ మాట్లాడుతుందని ఏమనుకున్నాడో తన చేతిని పట్టుకున్నాడు. నలభై ఐదు ఏళ్ల పడుచువాడు శర్మ 'నేనెప్పుడేనా నీకలలోకి వచ్చానా జయా?!' అంటూ అదోరకంగా చూస్తూ నవ్వుతూ భుజంమీద చెయ్యి వేసాడు. కన్నెపిల్లని చూస్తే కళ్లు కుడతాయి కాబోలు. దరిద్రపు వెధవలు! తనంటే ఏమనుకున్నారో! ఇంకెన్నాళ్ళులే. ఇంకో ఏడాది పోతే తన చదువయిపోతుంది. చక్కగా పెళ్లిచేసికుని, కంచుకోటలాంటి తన భర్త కౌగిట్లో హాయిగా ఆదమరచి నిద్రించవచ్చు. ఒకవేళ తన భర్తకూడ ఇలాంటివాడయితే? అమ్మో! వద్దు. మంచివాడవ్వాలి. శివాజీలాంటి సహృదయుడు అవాలి.'

జయలలిత కన్నె మనసు కలవరిస్తోంది.

'వానకి లైట్లు పోయాయి. కిరసనాయిలేమన్నా ఉంటే ఇద్దూ' అంటూ వచ్చిన సత్తెమ్మ వీధి గుమ్మంలోనుంచి శేషమ్మతో మాట్లాడుతూ మాట్లాడుతూ ఒక్కసారిగా గతుక్కుమంది.

'చూసావుటే శేషమ్మా! రాజేశ్వరి కూతురు ఇప్పుడొస్తోందే. దీని తిరుగుడు తగలడ. మాయదారి చదువులుగాని, మానాభిమానాల్ని మంట గలుపుతున్నాయి. అందుకనే మా రత్నాన్ని సమర్తాడగానే చదువు మానిపించి వంటా వార్పూ నేర్పుతున్నాను.'

'ప్రొద్దు గ్రుంకేదాకా తిరగడమేనా? అయినా తల్లిదండ్రులకు తెలిసుండాలి. పిల్లలు పాడవుతూంటే బుద్ధి చెప్పాకోనక్కరలేదూ?' సర్వం తనకు తెలుసుననుకునే శేషమ్మ వంత పాడింది.

వారి వాక్కులు జయలలిత హృదయాన్ని గాయపరిచాయి. భారంగా ఇంట్లో అడుగు పెట్టింది.

'ఏమే! ఇంత ఆలస్యమయిందేం? కాలేజీ అవగానే ఇంటికి రావాలని తెలియదా? బొత్తిగా భయం భక్తీ లేకుండా పోయాయి. పెళ్లీడుకొచ్చిన పిల్లవి కూడాను. ప్రొద్దుపోకుండా ఇంటికి రాలేవూ?' ఖంగుమంది తల్లి కంఠం.

'అది కాదే అమ్మా! వానొచ్చిందికదూ. అందుకని ఉషశ్రీ వాళ్లింట్లో ఉండిపోయానే.'

కూతురెంత చెప్తున్నా వినకుండా తన ధోరణిలో తను సాగిపోయింది రాజేశ్వరి.

'జయా! నీ వరస నాకేం నచ్చలేదు.' చిరాగ్గా అన్నాడు శంకరం.

'అబ్బ! ఎప్పుడూ ఇంతే. చదువుకుంటూంటే చెడగొడతాడు.' అనుకుంటూ 'ఏమిటన్నయ్యా, నువ్వనేది? నాకేమీ అర్థం కావడం లేదు.' అంది జయ.

'అవును. నీకేం అర్థం అవుతుంది? విచక్షణా జ్ఞానం ఉంటేగా? చిన్నప్పటినుండి కలిసి చదువుకుంటే మటుకు, ఎంత అన్నా చెల్లెళ్లలా ఉంటే మటుకు రోడ్డుమీద కనబడితే మాట్లాడెయ్యడమేనా? మంచి, చెడూ తెలిస్తేగా నీకు?' అంటూ రుసరుసలాడుతూ వెళ్లిపోయాడు, ఆడపిల్లలతో స్నేహం చేస్తూ, ఆడపిల్లలకి స్నేహపూర్వకంగా లెటర్సు వ్రాసే శంకరం.

పుస్తకం మూసేసి లైటార్పి పడుకుంది జయ. గుండె బరువెక్కి కన్నీళ్లు ధారాపాతంగా కారుతూంటే దిండులో తల దాచుకుంది జయ.

సూర్యం అన్నయ్యతో మాట్లాడితే తప్పా? ఎంత సంకుచిత స్వభావులు వీళ్లు? స్త్రీ—స్వాతంత్రం అంటూ ఎన్నో ఉపన్యాసాలిస్తారు. కాని ఆచరణలో అవి మృగ్యమే. కన్నెపిల్ల జీవితం ఎంత నికృష్టం? తల్లిదండ్రుల కనుమానం, అన్నయ్యల కనుమానం, అందరికీ అనుమానమే. సాటి స్త్రీలే చూపించలేరు సమరస భావం. కన్నెపిల్ల నవ్వితే అనుమానం, మాట్లాడితే అనుమానం, చూస్తే అనుమానం, కూర్చుంటే అనుమానం, నుంచుంటే అనుమానం. ఇలాంటి బ్రతుకు వద్దు బాబూ! ఇంకెన్నాళ్ళులే ఈ బాధ? పెళ్లి అయ్యేవరకేగా? తర్వాత చక్కగా భర్తచెంత కూర్చుని అతని చిలిపి నవ్వులకి, కొంటె చూపులకి కరగిపోతూ హాయిగా జీవితాన్ని గడిపేయవచ్చు. అప్పుడు తనని ఎవరేమంటారు?'

'ఒకవేళ తన భర్త మంచివాడు కాకపోతే? సుగుణ మొగుడు వట్టి అనుమానస్తుడట. 'కాలేజీలో చదివేటప్పుడు ఎవరినేనా ప్రేమించావా?' అంటూ చంపుకు తింటాడట. ఒక్కొక్కప్పుడు పశువులా కొడ్తాడట కూడ. తన భర్త అలాంటివాడయితే? అమ్మో ఇంకేమన్నా ఉందా? తను భరించలేదు. వద్దు తన కలాంటి మొగుడు వద్దు. విశాలమైన హృదయం కలవాడు, ఆ విశాలహృదయంలో తనని ముద్దుకునేవాడు; నగుమోముతో ముద్దిడుకునేవాడు; ప్రేమానురాగములతో స్వర్గాన్ని చూపించేవాడు కావాలి'

కళ్లముందు రాజకుమారుడు లాంటి ఊహాసుందరుడు కదలాడుతూంటే వల్లమాలిన సిగ్గు ముంచుకొచ్చింది జయలలితకి.

'ఛీ! తనమనస్సు కసలు బుద్ధిలేదు. ఇంత బరితెగించి పోయిందేమిటో? బొత్తిగా సిగ్గు లేకుండా పోయింది' మనస్సుని మందలిద్దామని ఎగిరెగిరి పడుతున్న ఎదమీద చేయి వేసికుంది. అయినా ఆమె కన్నెమనసు చెప్పినమాట వినకుండా గంతులేస్తోంది. మధురానుభూతులెన్నో ఒక్కుమ్మడిగా వచ్చి మత్తు కల్గిస్తూంటే హాయిగా నిద్రపోయింది జయలలిత.

* * *

ఆరోజు ఆదివారం. మధ్యాహ్నం మూడు గంటలయింది. వీధి వరండాలో రాజేశ్వరి, సోదెమ్మగారు గట్టిగా అరచుకుంటున్నట్లు దెబ్బలాడుకుంటునట్లుగా మాట్లాడుకుంటూన్నారు. మంచంమీద పడుకుని 'మర్కాంటైల్ లా' పుస్తకాన్ని తిరిగేసి పట్టుకుని చదువుకుంటోంది జయలలిత.

'కాఫీ పెట్టవే జయా!' అంటూ పురమాయించింది రాజేశ్వరి.

కూనిరాగం తీస్తూ లేచింది జయ.

'చదువుకునే పిల్లలు పనులు చేస్తారా? రాజేశ్వరీ! మా బావగారబ్బాయి చదువుకున్నపిల్ల కావాలని కోరి చేసికున్నాడు. ఇప్పుడు వాడిగడ్డి వాడికెదుట్లోందాపిల్ల. ఇప్పుడెంత అఘోరిస్తే ఏం లాభం? నువ్వేన్నీ చెప్పు రాజేశ్వరీ! ఎలాగైనా చదువుకున్న పిల్లలు చెప్పిన మాట వినరమ్మా. మొగుడంటే లక్ష్యం ఉంటుందా

ఏమన్నావా? మా పనమ్మగారి కూతురి కొడుకు వాడూ ఇంతే, ఏరి కోరి చేసికున్నాడు చదువుకున్న పిల్లని. ఎందుకో కోపం వచ్చి ఓ లెంపకాయ వేసాడట. అంతే ఆమటక వాడికి విడాకులిచ్చేసి ఇంకో పెళ్ళి చేసేసికుంది. దానికర్మం కాలా మొగుడన్నతర్వాత కొట్టకుండా ఉంటాడా? పెళ్ళయినప్పటి నుండి నేనెన్ని దెబ్బలు తిన్నాను? ఇంత పెద్ద దాన్నయ్యాక కూడ అప్పుడప్పుడు తగుల్తూనే ఉంటాయి. ఏవో లోటుపాట్లు మనలో లేకపోతే ఊరికే కొడ్తారా? ఆ కొత్త మొగుడుమటుకు కొట్టకుండా ఉంటాడా?' మైక్ అవసరం లేకుండానే ఉపన్యసిస్తోంది సోదెమ్మగారు. స్టౌ వెలిగించి నీళ్ళు పడేసింది జయ. ఒకసారి ఆకాశం లోకి నిశితంగా చూసింది. చమటలు గ్రక్కించే ఎండ చల్లని వెన్నెలలా కనిపిస్తోంది. సూర్యుడు చందమామలా అగుపించాడు. ఆ చందమామలో ఒక నవ యువకుని మోము నవ్వుతూ పిలిచింది. జయలలిత హృదయం ఉప్పొంగింది.

## కన్నెపిల్ల

'చదువుకి, దాంపత్యానికి సంబంధం ఏమిటి? ఎంత చదువుకుంటే మటుకు మనసుండదా? అందులో మమత్వుండదా? తనభర్తని తనెంతో ప్రేమగా చూచుకోవాలి. తను నిర్లక్ష్యం చేస్తుందా?— ఉహూ. లేదు. ప్రాణంకంటె మిన్నగా చూచుకుంటుంది. దైవంలా భక్తిగా ఆరాధిస్తుంది. అతని పాదాలమీద పుష్పమై పోతుంది. ఆ పుష్పాన్ని కళ్ళకద్దుకుని హృదయానికి హత్తుకుంటాడు. నిండు హృదయంతో అతని కౌగిలిలో కరగిపోతుంది. పార్వతీ పరమేశ్వరుల్లా, లక్ష్మీ నారాయణుల్లా, సరస్వతీ బ్రహ్మలవలె, రాధామాధవులలాగా, రతీమన్మథుల్లా నందనవనజీవితాన్ని గడిపి జన్మ పునీతం చేసికోవాలి.'

'ఒకవేళ తన భర్త దుర్మార్గుడైతే, స్త్రీలోలుడైతే?' ఆమె అరమోడ్పు కన్నులదరిపడ్డాయి.

'అమ్మో ఇంకేమన్నా ఉందా? తను భరించలేదు. తన గుండెలు బద్దలయిపోవూ! అప్పుడు మరి తానేం చేయాలి? విడాకులిచ్చేస్తుందా?—ఉహూ. తనెప్పుడూ అలా చేయదు. పవిత్రమైన వివాహ బంధాన్ని తెంపేసుకుంటుందా? కావాలని పెళ్ళిచేసికుని మళ్ళీ విడిపోతుందా? అలా ఎప్పుడూ చేయదు, తన తెలివి తేటలతో భర్తని మంచివాడిగా మార్చాలి. తన ప్రేమ సాగరంలో అతడిని ముంచివెయ్యాలి, ప్రేమ కవ్వముతో అతని హృదయాన్ని చిలికి వెన్న తియ్యాలి. అతని కన్నులకింపుగా, వీనుల విందుగా, మనోరంజకంగా తనుంటే తనను వదలి అతడెక్కడికి వెళ్తాడు? తననెందుకు బాధపెడ్తాడు? తన గృహాన్ని తను స్వర్గసీమను చేసికోలేదా? అయినా తనకు మంచి మొగుడొస్తాడని అంతరాత్మ చెప్తోంది. చిన్నప్పటినుండి గొబ్బెమ్మలనుపెట్టి పూజ చేసి కుంటోంది. 'మొగలి పువ్వంటి మొగుణ్ణియ్యవే' అంటూ వాటికి ప్రదక్షిణాలు చేస్తోంది.'

ఆమె పెదవులమీద చిరునవ్వు చిందులాడింది.

ఆమె శరీరానికి వెచ్చగా తగిలింది, మధురానుభూతికి లోనవుతూ మైమరచింది. ఒక్కసారి భగ్గుమంది జయలలిత శరీరం. ఊహాలోకాల్లో విహరిస్తూ తన ఉనికినే మరచింది జయ. ఆమె పైటజారి స్టౌమీద పడటం చూసుకోలేదు పాపం.

'అమ్మా! అమ్మా!' అంటూ గావుకేకలు పెట్టింది. కబుర్లలో కంప్లీట్‌గా మునిగిపోయిన తల్లికీ, సోదెమ్మగారికీ ఆ పిలుపు అందలేదు. వాళ్ళ సోది తగులడ బయటి ప్రపంచాన్ని మరచిపోయినట్లున్నారు వాళ్ళు. ఆఫీసుకెళ్ళిన తండ్రికీ, మ్యాటనీ షోకెళ్ళిన అన్నయ్యకీ, ఆటలకెళ్ళిన పిల్లలకి అసలే వినిపించదా పిలుపు.

'ఎంతసేపే కాఫీ కలపడం ?' అంటూ వచ్చింది రాజేశ్వరి.

కుందనపు బొమ్మలాంటి జయలలిత కమిలిపోయి క్రిందపడి ఉంది మూల్గుతూ.

ఒక్కసారిగా బావురుమంది రాజేశ్వరి.

* * *

ఊరంతా గుప్పుమంది జయలలిత మరణవార్త.

'అయ్యో! విన్నారా? జయలలిత ఆత్మహత్య చేసికుందట. చాటుమాటుగా తిరిగితే కడుపొచ్చిందట. — భరించలేక వళ్ళు

## నటిగాకంటె నిర్మాతగానే ఆనందం!



తెరకి పరిచయమైనఅనతికాలంలోనే ప్రేక్షకుల ఆదరాభిమానాల్ని చూరగొన్నవారిలో వాసంతి ఒకరు. ఆమె ఇక వాసంతి చిత్రాల్లో నటించదని తెలుసుకున్నపుడు అభిమానులు తప్పక నిరాశపడతారు. వారిని పూర్తిగా నిరాశ పరచకుండా ఇప్పుడు నిర్మాతగా పరిచయమవుతున్నారు.

ఇదివరలో కొన్ని డబ్బింగు చిత్రాలనువిడుదల చేశారు. ఇప్పుడు కల్పనాలయా బ్యానర్ మీద స్ట్రెయిట్ పిక్‌గా 'భలేపాప' చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

'నటించడంకంటె చిత్రాలని నిర్మించడమే సరదాగా వుంటుంది.' అన్నదామె. అంచేత ఇక ముందు నిర్మాతగానే స్థిరపడ దలచినట్లు ఆమె చెప్పారు.

సెట్‌లో ఆమె వుత్సాహం చూస్తుంటే ఎవరికయినా అలానే అనిపిస్తుంది. నవ్వులోనే ఆజ్ఞాపన మిళాయించగల మనస్తత్వం ఆమెది. తానొచ్చకుండా ఇతరులను నొప్పించకుండా నవ్వుతూ నవ్విస్తూ అందరి సహకారాన్ని తీసుకుంటూ పనిని సమగ్రంగా నిర్వహించుకోగల చాకచక్యం ఆమెలో కనిపిస్తుంది.

'ఖోస్లా కమిటీ సూచనలు చిత్రాలని తప్పకుండా విజయవంతం చేస్తాయి.' నిర్మాతగా 'ముద్దు' మీద ఆమె అభిప్రాయం ఇది. నటించబోవడం లేదుగనక 'నటి'గా ఆమె అభిప్రాయం రిజర్వ్‌డ్‌గానే వుండిపోయింది!

—ఒ: వి.

అంటించుకుని చచ్చిపోయింది' — ఇంటా, బయటా, కాలేజీలోను ఎక్కడ చూసినా ఇవే మాటలు వినిపిస్తున్నాయి. స్నేహితురాలి వియోగంతో ఏడ్చి ఏడ్చి ఉషశ్రీ కళ్ళు ఎర్రటి జ్యోతులయిపోయాయి. అసలే కుమిలిపోతున్న ఆమె గుండెల మీద నమ్మెటపోటులా తగిలింది ఈ అపవాదు.

'నన్ను అన్యాయం చేసిపోయావా జయా? నాకు తెలుసు జయా! నాకు తెలుసు. నువ్వెంతో మంచిదానివి. నిప్పు లాంటి దానివి. నీ హృదయంలోని పవిత్ర భావాలు, ఉదాత్తాశయాలు, నీ కన్నులలోని బంగారుకలలు నీకు, నాకు, దేవుడి తప్ప ఎవరికి తెలుస్తాయి జయా? నీవు లేకుండా నేను బ్రతకలేను జయా! నీలాటి ఆత్మీయురాలు నా కెక్కడ దొరుకుతుంది? నేను బ్రతకలేను. నేనూ, వచ్చేస్తాను నీ దగ్గరకు. ఎక్కడున్నావు నా జయా?

## కన్నెపిల్ల

ఎక్కడున్నావు ? నాకు చెప్పు.' అంటూ ఉషశ్రీ హృదయం ఆక్రోశిస్తోంది. ఎక్కడ చూసినా తనను పిలుస్తున్నట్లుగా చిరు నవ్వు ముఖంతో జయే కనిపిస్తోంది. అంత లోనే మంటల్లో మండుతూ దీనంగా ఏడుస్తూ వద్దని వారిస్తూన్న జయ లలిత ముఖం కనబడింది — ఉషశ్రీ హృదయం భగ్నమంది.

'హా ! ఎంత నీచమైనది ఈ లోకం? నిజా నిజాలు తెలియకుండా నోటి కొచ్చి నట్లు వాగడమేనా ? జయలలితకున్న సౌహార్ద్ర గరిమ, సౌశీల్యం ఎవరికున్నాయి? అలాటి అమాయకురాలినా అనేది ? కన్నె పిల్ల జీవితం ఎంత నికృష్టం ? ఎంత కఠినం ? ఆఖరికి కన్నెపిల్ల చచ్చిపోతే కూడ పాపమేనా ? అసలే కడుపుశోకంతో ఏడుస్తూన్న ఆ తల్లిదండ్రుల హృదయా లకు ఇలాంటి అపవాదు ఎంత గొడ్డలి పెట్టు ? ఛీ! ఈ క్షుద్ర ప్రపంచంలో తనుండలేదు — ఎక్కడికో దూరంగా ఈ మనుష్యులు కనబడని చోటికి వెళ్లిపోవాలి. కాని ఎక్కడికెళ్తుంది? తాను నిస్సహాయు రాలు. తనూ కన్నెపిల్లే. తన జీవితమూ ఇంతే. తనే కాదు. ఎందరో కన్నెపిల్లలున్నారు. ఆ కన్యలను గన్న తల్లిదండ్రులున్నారు ఆ కన్యలకన్నయ్యలున్నారు. కానీ కొంతైనాకూడ ఆలోచించకుండా అలాగ ఆడిపోసుకుంటారేం ? ఇదే నా లోకం తీరు ? ఒక కన్య ఇంకొక కన్యను విమర్శిస్తుంది. ఒక కన్య తల్లిదండ్రులు మరియొక కన్య తలిదండ్రులను విమర్శిస్తారు. ఇదేనా జీవితవిధానం? వీళ్ళకి సహృదయం లేదా ? తానేం చేయగలదు ? తను చెయ్యగలిగింది ఒక్కటే. కన్నీరు కార్చడం తప్ప ఏం చేయలేదు. భగవాన్ ! ఈ కన్నెపిల్లల జీవితాన్ని ఎందుకిలా చిత్రించావు?' అంటూ ఆక్రోశించింది ఉషశ్రీ

   

భానుమతి  వైజయంతిమాల  జమున  పద్మిని

# బొంబాయి చిత్ర రంగంలో

# దక్షిణాది తారల వెలుగులు!

హిందీ చిత్రరంగంలో కథానాయిక వేషాలను ధరిస్తున్న తారామణుల్లో చాలామంది దక్షిణాదివారే. హిందీ దర్శక నిర్మాతలకు దక్షిణాది తారల గ్లామర్‌పైన గట్టి నమ్మకం ఏర్పడడానికి వారు నటించిన చిత్రాలు సాధించిన దిగ్విజయాలే కారణం.

శ్రీమతి భానుమతి నటించిన మొదటి హిందీ చిత్రం నిషాన్; ఇటీవలి చిత్రం 'నయీ రోషనీ.' ఈమె 'చండీరాణి' చిత్రాన్ని డైరెక్టు చేసింది కూడా.

శ్రీ ఎం. వి. రామన్ వైజయంతిమాలను హిందీ రంగానికి పరిచయం చేసారు. ఆమె తన నటనతోనూ, నాట్యంతోనూ ప్రేక్షకులను ఆకట్టుకుంది. బాక్సాఫీస్ తారగా విరాజిల్లుతూంది.

పద్మినియొక్క అందాన్ని, నటనా ప్రతిభను హిందీ ప్రేక్షకులకు చూపించిన వ్యక్తి రాజకపూర్. ఆ పైన ఆమె తన కళానైపుణ్యంతో ప్రేక్షకులను రంజింప చేసింది. హిందీ రంగంలో తనకొక ప్రత్యేక స్థానాన్ని సంపాయించుకుంది.

శ్రీమతి జమున 'హంగామా', 'మిలన్' చిత్రాలలో ఉత్తమ నటనను ప్రదర్శించి ప్రేక్షకుల అభిమాన ధనాన్ని ఆర్జించుకుంది.

శ్రీమతి సావిత్రి 'ఘర్ బసాకే దేఖో', 'బలరాం శ్రీకృష్ణ' చిత్రాలలో నటించి హిందీ ప్రేక్షకులకు సన్నిహితురాలయ్యింది.

శ్రీ పతి పిళ్ళైపురాలు జానకీ, కాంచన, జయంతి 'దిల్ బహలాతే హై' చిత్రంలో పోటాపోటీగా నటించి, హిందీ రంగపు అభిమాన నాయికలయ్యారు.

శ్రీమతి సరోజాదేవి 'ససురాల్' చిత్రంద్వారా హిందీ చిత్రరంగపు నాయిక అయింది.

అట్లాగే రాజశ్రీ, గీతాంజలికి హిందీ మార్కెట్టులో సరయిన స్థానం దొరికింది.

జయలలిత 'ఇజ్జత్' చిత్రంలో చక్కటి నటనను అగుపరిచి, హిందీ చిత్ర ప్రేక్షకులకు దగ్గర చుట్టం అయింది.

'రోజులు మారాయి' చిత్రంలో 'ఏరువాకా సాగారో' అన్న డ్యాన్సు ద్వారా వెండితెరకు పరిచయమయిన వహీదా ప్రముఖ దర్శక నిర్మాత గురుదత్ గుర్తించి ఆమెకు నాయిక పాత్రను యిచ్చి ఆదరించారు. నేడు ఆమె మేటి హిందీనటిగా ప్రకాశిస్తూ వుంది.

'సప్నోంకా సౌదాగర్' చిత్రంలో రాజకపూర్‌కు జంటగా నటించే అవకాశం హేమమాలినికి రావడమే ఆమెకు దేవుడిచ్చిన వరం. ఇపుడామె కోసం నిర్మాతలు వరుసలో నిలబడుతున్నారట!

ఇటీవలనే, పుష్పవల్లి కుమార్తె భానురేఖ కూడా హిందీ చిత్రరంగపు నిర్మాతల దృష్టిని ఆకర్షించింది.

— శ్రీనివాస్

   

సావిత్రి  జయలలిత  సరోజాదేవి  వహీదా రెహ్మాన్

# మదరాసులో ఫొక్కర్ ఎఫ్-28 విమానం ప్రదర్శన

రాయల్ నెదర్లాండ్స్ విమానాల ఫాక్టరీలు ఫొకర్—స్కిఫోల్—హాలండ్ వారు నిర్వహిస్తున్న ప్రయాణీకుల ఆధునిక జెట్ విమానం ఫొకర్—28 ప్రదర్శనా పర్యటన సందర్భంగా యిటీవల మదరాసు వచ్చింది.

'రన్ వే'లో నాలుగోవంతు కూడా అవసరం లేకుండా పైకి ఎగురగలిగిన ఈ విమానం 20 వేల అడుగుల ఎత్తున కారవెల్లి లాంటి పెద్ద విమానాలతో సమానమైన వేగంతో ప్రయాణం సాగించింది. జర్నలిస్టులు, వ్యాపారస్తులు, కంపెనీ ఎగ్జిక్యూటివ్‌లు, సాంకేతిక నిపుణులని ఎక్కించుకుని ఎఫ్—28 మదరాసుకు తూర్పుగా సముద్రంపై 136 మైళ్ళు వెళ్లి 45 నిమిషాల్లో తిరిగి వచ్చింది. విమానం పైకెగిరేటప్పుడు కానీ, దిగేటప్పుడు కానీ కుదుపు, శబ్దం లేవు.

60—65 మంది కూర్చోవటానికి వీలైన ఈ విమానం బయలుదేరడానికి 4600 అడుగుల పొడుగు ఉన్న 'రన్‌వే' చాలు. భారతదేశంలోని పరిస్థితులలో 3200 అడుగులు ఉంటే చాలని ఫొకర్ విమానాల మార్కెటింగ్ డైరెక్టరు శ్రీ వాన్‌డూన్ చెప్పారు. దీని వేగం గంటకి 530 మైళ్ళు అనీ 35000 అడుగుల ఎత్తు వరకూ ఎగురగలదనీ ఆయన తెలియజేశారు.

ఈ విమానానికి తోకలో రెండు ఎయిర్ బ్రేక్‌లని అమర్చారనీ, ఈ ఏర్పాటు "విప్లవాత్మకమైనద"నీ శ్రీ వాన్‌డూన్ అన్నారు. చక్రాల టైర్లకు గాలి తక్కువగా ఉండటాన్ని మరో విశేషంగా ఆయన పేర్కొన్నారు. ఇందువల్ల విమానం గరుకు రోడ్ల మీద గడ్డి అవీ ఉన్న చోటు నించి కూడా పని చేయగలదని ఆయన చెప్పారు.

భారతదేశంలో ఈ రకం విమానాల ఉత్పత్తి చేసే సందర్భాన ఈ సారి ఏదైనా ఒప్పందం కుదర వచ్చుని తాము విశ్వసిస్తున్నట్లు మార్కెటింగ్ డైరెక్టర్ తెలియ జేశారు. పారిశ్రామికంగా సహకరించడానికి తమ ఫాక్టరీ సిద్ధంగా ఉన్నట్లు కూడా ఆయన తెలియ జేశారు.

భారతదేశంలో ఫొకర్ విమానాల ఫాక్టరీలకి ప్రతినిధులైన ఆర్‌వేన్ మానేజింగ్ డైరెక్టర్ శ్రీ డి. బి. పార్థసారథి డచ్ ఉద్యోగులని పరిచయం చేసి భారత దేశంలో స్వల్పదూర ప్రయాణాలకి ఫొకర్ ఎఫ్—28 ఆదర్శప్రాయమైనదని చెప్పారు. హాలండ్‌లో ఫొకర్స్ తయారు చేస్తున్న వస్తువులన్నిటినీ భారత దేశంలో ఉత్పత్తి చేయవచ్చునీ ఇతరుల నుంచి ఫొకర్స్ తీసుకుంటున్న వాటిని కూడా భారతదేశంలోనే ఉత్పత్తి చేసుకోవచ్చునీ ఆయన అన్నారు.

ఈ ప్రదర్శన జయప్రదం అవటానికి విమానాశ్రయాల కంట్రోలర్ కర్నల్ జోగిందర్‌సింగ్, ఇండియన్ ఎయిర్ లైన్స్ అధికారులు ఎంతో సహకరించారు. ప్రదర్శనలో పాల్గొన్నవారిలో మద్రాసు మేయరు శ్రీ వేలూరు డి. నారాయణన్, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి శ్రీ రామకృష్ణన్, శ్రీ ఎ. కృష్ణమూర్తి [ అమాల్గమేషన్స్ ], శ్రీ ఎ. ఎం.ఎం. అరుణాచలం [ ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ] ఉన్నారు.

[ కు.వి. ]



సైకిలుమీద అన్నేయానియా—ఉర్లాటన చేస్తున్న శ్రీ ఎ. వి. శర్మ

## ఫిలిం జర్నలిస్టుల సమాఖ్య ఆధ్వర్యంలో నిజం నాటకం

మహాకవి శ్రీ శ్రీ సన్మానాన్ని పురస్కరించుకుని మద్రాసు ఫిలింజర్నలిస్టుల సమాఖ్య ఆధ్వర్యంలో నాట్యభారతి [విశాఖపట్నం] వారిచే 'నిజం' నాటకం ప్రదర్శించబడింది. రచయిత శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రి కూడా పాల్గొన్న ఈ నాటిక బాగా రంజింప జేసింది. అయితే, మద్రాసులో 'మహాకవి' శ్రీశ్రీకి సన్మాన మప్పుడు హాజరయిన జనాన్ని చూస్తే ఆశ్చర్యమే అనిపించింది. కవిత్వంలో ఒక కొత్త శకాన్ని సృష్టించిన మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా హాలయినా సరిగ్గా నిండలేదు. ఇది చాలా శోచనీయమైన విషయం. శ్రీ శ్రీ సన్మానానికి శ్రీ బి. యన్. రెడ్డి అధ్యక్షత వహించారు.

## దక్షయజ్ఞం

చంద్రశేఖర నాట్య కళాలయం వారు 'కేరళ సమాజం' హాలులో దక్షయజ్ఞం నృత్య నాటికను సర్వజనరంజకంగా ప్రదర్శించారు. మరికొన్ని నృత్య రీతుల్ని ప్రదర్శించిన ఈ కార్యక్రమానికి డా. యస్. కె. నాయర్ అధ్యక్షత వహించారు.

## నాటిక ప్రదర్శన

తెనాలి ఆర్. టి. సి. డిపో మానేజర్ ప్రమోషన్ సందర్భంగా డ్రమెటిక్ అసోసియేషన్‌వారు 'ఇదే నిజం' నాటికని ప్రదర్శించారు.

## దేవీ పూజా మహోత్సవం

స్థానిక ఉగాది కల్చరల్ అకాడెమీవారు శ్రీ ఆత్మకూరి కస్తూరి రంగాచార్యుల ఆధ్వర్యంలో దేవీ పూజా మహోత్సవం వైభవంగాజరుపుకున్నారు. కార్యక్రమంలో బాలమురళీకృష్ణ, యస్. రాజేశ్వర రావు మొదలైన వారు పాల్గొన్నారు. మూడు రోజుల కార్యక్రమాన్ని కార్యదర్శి శ్రీరాములు గుప్తా ఉత్సాహంగా నిర్వహించారు.

## భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ క్లబ్

భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ క్లబ్‌వారు 'సాహితీ ప్రియ' అన్న లిఖిత పత్రికను వెలువరిస్తున్నారు. మొదటి మాసపత్రికను శ్రీమతి సి. ఆనందరామం ఆవిష్కరించారు.

## కన్యాశుల్కం

తెలుగు మహాజన సమాజం నూర్రులు వార్షికం ధనుణమూర్తి అండ్ పార్టీవారు 'కన్యాశుల్కం' నాటకాన్ని మద్రాసు రాణీమహల్‌లో

ప్రదర్శించారు. నటీనటులందరూ చక్కగా నటించిన ఈ నాటకం ఆబాలగోపాలన్నీ బాగా రంజింపజేసింది.

## చిత్రకళా ప్రదర్శనం

ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ ఆవరణలో శ్రీ రెడ్డెప్పనాయుడు చిత్రకళాప్రదర్శనానికి శ్రీపాల్ కె. మారిస్ ప్రారంభోత్సవం చేశారు. తూర్పు గోదావరిజిల్లాకు చెందిన యువకుడు శ్రీ రెడ్డెప్పనాయుడు అనేక జాతీయ బహుమతుల్ని బంగారు పతకాల్ని పొంది వున్నారు. 1956—1969 మధ్య వేసిన పెయింటింగ్స్ 25 వరకు ప్రదర్శనలో వుంచారు. భావపూరితాలయిన ఈ చిత్రాలు రసజ్ఞుల మన్ననలందుకున్నాయి.

## దక్షిణ భారత వైశ్యసంఘం

దక్షిణ భారత వైశ్యసంఘం వారు దసరా వేడుకలను పురస్కరించుకుని 'చిత్రాంగి—సారంగధర' నాటకాన్ని ప్రదర్శించారు. ఇందులో శ్రీయుతులు విప్రనారాయణ, సుబ్రహ్మణ్యం, జయకుమార్, వరదరాజులు, మదన్‌కుమార్, కుమారి జయ నిర్మల, పద్మ, రమాదేవి మొదలైనవారు చక్కగా నటించారు. సాలూరు హనుమంతరావు సంగీతం కూర్చారు.

## గాంధీ శత జయంత్యుత్సవం

న్యూజిలాండులోని ఆక్‌లాండ్‌లో గాంధి శత జయంత్యుత్సవాలు అయిదువారాలపాటు అత్యంత వైభవంగా జరిగాయి. ఆక్‌లాండ్ ఇండియన్ అసోసియేషన్ ఆధ్వర్యాన గాంధి హాలులో జరిగిన ఈ ఉత్సవాలకు ఆక్‌లాండులోవున్న 800 మంది భారతీయులతోపాటు పలువురు పుర ప్రముఖులు కూడా హాజరయినారు. న్యూజిలాండులోని భారతదేశపు రాయబారి ఈ ఉత్సవాలలో పాల్గొన్నారు. పలువురు భారతీయులు— స్త్రీలు, పురుషులు, పిల్లలు — గాంధిగారి గుణగణాలను కొనియాడుతూ ఉపన్యసించారు. గాంధిగారి జీవిత చరిత్ర చలనచిత్ర రూపంలో చూపారు. ఆయన ఉపన్యాసాలని టేప్ రికార్డర్ ద్వారా వినిపించారు. వ్యాసరచనలోనూ, చిత్రలేఖనములోనూ పోటీలు జరిపి పిల్లలకు బహుమతులు పంచిపెట్టారు. న్యూజిలాండు దేశీయులు కూడా గాంధిమహాత్ముని శాంతి సూత్రాలను అమలుపరచడానికి దృఢ కంకణం కట్టుకున్నారు.

—[ఎ. వి.]

# సినిమా

"తారాశశాంకము" కథ జగద్విదితం. నాటక రూపంలో ప్రజలను రంజింపచేసిన రమణీయశిల్పం. ఇప్పుడు చిత్రరూపంలో విడుదలకాబోతూంది. స్వర్గీయ సముద్రాల రాఘవాచార్య సంభాషణా రచన ఈ పురాణ కథను ఆంధ్ర ప్రజకు నచ్చేవిధంగా దర్శకుడు శ్రీ మానాపురం అప్పారావు రూపొందించారు. సంగీతాన్ని శ్రీ టి. వి. రాజు, ఛాయను శ్రీ సత్యనారాయణ, కళను శ్రీ కుమార్ నిర్వహించారు. శ్రీ సత్యనారాయణ నిర్మించిన ఈచిత్రాన్ని పూర్ణావారు విడుదల చేస్తున్నారు. ఈ చిత్రంలో తారగా దేవిక చంద్రుడిగా శోభన్‌బాబు దేవగురువు బృహస్పతిగా శ్రీ గుమ్మడి, రాక్షసగురువు శుక్రునిగా శ్రీ ధూళిపాళ, దేవేంద్రునిగా శ్రీ మిక్కిలినేని, నారదునిగా శ్రీ కాంతారావు, మహావిష్ణువుగా శ్రీ హరనాథ్ నటించారు.

## లాటరీ కొట్టిన బేబీ రాణి

బేబిరాణి (చిన్నపాప) ఒకరూపాయిచ్చి లాటరీ టిక్కెట్టు కొంటుంది. ఆ టిక్కెట్టుకు ఫస్టుప్రయిజు వచ్చింది. ఆ వార్త అందరికీ తెలిసిపోయింది. ఆ పాపాయివద్దనుండి ఆ టిక్కెట్టును తస్కరించడానికి సాధువు మొదలు పెద్ద జమీందారువరకు నానోపాయాలు పన్ని ఆ డబ్బును వాళ్లు దక్కించుకోవాలనుకుంటారు. కానీ ఆ పాపాయి వయస్సులో చిన్నదయినా బుద్ధిలో బృహస్పతిని మించినది. అందుకే వాళ్లందరి కళ్లల్లో కారంకొట్టి తను టిక్కెట్టుతో తప్పించుకుని ఒక పెద్ద యింట్లోకి ప్రవేశిస్తుంది. అక్కడ ఏం జరిగింది? పాపాయి దగ్గరున్న లాటరీ టిక్కెట్టును ఆయింటి యజమాని (అందరిలాగే) కొట్టెయ్యడానికి ప్రయత్నించారా? లేదా? అక్కడ ఏంజరిగిందో తెలుసుకోవాలంటే శ్రీ కల్పనాలయా నిర్మిస్తున్న 'భలేపాప' చిత్రం చూడండి. ఈ చిత్రానికి శ్రీ ఆరుద్ర రచన చేసారు దర్శకత్వాన్ని వి. రామచంద్రరావు, ఛాయను ఎస్. ఆర్.స్వామి, కళను కుమార్, సంగీతాన్ని సుదర్శనం నిర్వహిస్తున్నారు. ఈ సంస్థకు అధినేత నటి వాసంతి. ఈమె నిర్మిస్తున్న మొదటి స్ట్రెయిట్ చిత్రం యిదే అయినా మంచి ఫ్యామిలీ సెంటిమెంట్స్‌తో నిండిన కథను ఎన్నుకుంది. విడిపోయిన భార్యాభర్తలను మరలా ముడివెయ్యగల సామర్థ్యం పసిబిడ్డకు గలదని నిరూపించే చక్కటి చిత్రమే 'భలేపాప' ఈ చిత్రం తమిళంలో నిర్మించబడి తమిళుల అభిమాన ఆదరణలను సంపాయించింది. ఈ చిత్రం శ్రీఫిలింస్‌ద్వారా విడుదలవుతుంది. ఈ చిత్రంలో మీ అభిమాన తారల్లో చాలామంది అతిథినటులుగా కనిపిస్తారు. ముఖ్యపాత్రలను ఎస్వీ రంగారావు, కె. ఆర్. విజయ, హరనాథ్, రావికొండలరావు, కృష్ణంరాజు, అల్లు రామలింగయ్య పోషిస్తున్నారు.



"దొరలా – దొంగలా"లో విజయలలిత.

## ధర్మదాత అక్కినేని

భారతంలో కర్ణుడు దానధర్మాలకు అనితరుడుఅని మనందరికీ తెలుసు. అలాగే ఈ యుగంలోకూడా ఒక మహానుభావుడు అడిగినవారికల్లా లేదనకుండా యిచ్చి ధర్మదాతఅని పేరు తెచ్చుకున్నాడు. ధర్మం జయిస్తుందా? మాట (ఆడినప్రకారం నడిస్తే) మనిషి అంతస్తును పెంచుతుందా? దానకర్ణుణ్ని సంఘం ఎలా గౌరవిస్తుంది? డబ్బు వున్నంతవరకు, ఆ డబ్బును ఆయన



'భవానీ ఫిలింస్' చిత్రంలో రామారావు, సరోజా దేవి.

దగ్గర్నుంచి తీసుకువేంతవరకు ప్రజలు ఎలా ప్రవర్తిస్తారు? అదే పెద్దమనిషి దగ్గర డబ్బు అయిపోయినవాడు, ప్రజలు ఎలా మారిపోతారు? అనేది నిత్యసత్యాన్ని తెలుసుకువేందుకై శ్రీ బాలమురుగన్ 'ధర్మదాత' కథను వ్రాశారని అనిపిస్తుంది ఆ కథకు శ్రీ పినిసెట్టి సంభాషణలు యెలా పదును పెట్టాయో 'ధర్మదాత' చిత్రం చూస్తే మీకే తెలుస్తుంది. శ్రీ తమ్మారెడ్డి కృష్ణమూర్తి నిర్మిస్తున్న యీ చిత్రంలో ధర్మదాతగా శ్రీ అక్కినేని నటిస్తున్నారు. ధర్మదాత కుమారుడిగా కూడా శ్రీ నాగేశ్వరరావే సరికొత్త తరహా పాత్రను పోషిస్తున్నారు. తండ్రీ కొడుకులు వాదించే దృశ్యాలను దర్శకుడు శ్రీ సంజీవి ఛాయాగ్రాహకుడు శ్రీ వెంకటరత్నం సహాయంతో యిటీవల సారధి స్టూడియోలో చిత్రీకరించారు. ఈ చిత్రంలో గీతాంజలి నటిస్తున్నారు. [illegible] ఫిలింస్ విడుదలచేసే యీ సాంఘి



'గండర గండడు'లో
కాంతారావు, జ్యోతిలక్ష్మి



'అక్కా చెల్లెలు'లో నాగేశ్వరరావు, జానకి

కంలోని యితర ముఖ్యపాత్రలను సావుకారు జానకి, కాంచన, పద్మనాభం, నాగభూషణం, రేలంగి, విజయలలిత, లలిత, అల్లు రామలింగయ్య, ధరిస్తున్నారు. ఈ చిత్రంలో సంగీతం మధురాతి మధురంగా వుండడానికై శ్రీ చలపతిరావు సరిగమ పదనిసల సారాన్ని ఒకపట్టుపడుతున్నారనే చెప్పాలి.

* * *

శ్రీ డి. వి. నరసరాజు విరచితంబయిన రాముడు భీముడు తెలుగువాళ్ళకేగాక తమిళ హిందీ ప్రజలకు కూడా అప్తురాలయింది. ఇప్పుడు ప్రపంచ మార్కెట్టుకూడా పరిచయం కాబోతూంది. ఇది మనందరికీ గర్వకారణం. అలాగే 'రాముడు భీముడు' 'ఎంగవీట్టు పిళ్ళై' 'రామ్ ఔర్ శ్యామ్' చిత్రాలను డైరెక్టుచేసి ఆయా భాషా చిత్రాల విజయానికి కారకుడయిన 'రోజులు మారాయి' ఫేం డైరెక్టరు శ్రీ తాపీ చాణక్య ఇంగ్లీషు చిత్రాన్నికూడా డైరెక్టు చెయ్యడం ముదావహం. ఈ చిత్రం యొక్క షూటింగు స్పెయిన్‌దేశంలో జరుగగలదని తెలుస్తూంది. మన తెలుగువారయిన శ్రీ బి. రాధాక్రిష్ణ సాహసించి ఈ చిత్రాన్ని ఇంగ్లీషులో నిర్మించ పూనుకోవడం మన తెలుగు పరిశ్రమకు విదేశీయుల్లో పేరు ప్రఖ్యాతులను తెచ్చిపెట్టడం తథ్యం.

* * *

శ్రీ డుక్కిపాటి మధుసూదనరావు నిర్మిస్తున్న అన్నపూర్ణా పిక్చర్స్ తాజా సాంఘికం శ్రీ యోగానంద్ నిర్దేశకత్వంలో హైద్రాబాదు సారధిలో యిన్‌డోర్ షూటింగు జరుపుకుంటూ వుంది. శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి కథకు శ్రీ డి. వి. నరసరాజు సంభాషణలను సమకూర్చారు ఈ చిత్రానికి శ్రీ రాజేశ్వరరావు సంగీతాన్ని, శ్రీ జి. వి. సుబ్బారావు కళను శ్రీ సెల్వరాజ్ ఛాయను, శ్రీ చౌదరి మేకప్ శాఖను నిర్వహిస్తున్నారు. చిత్రంలోని ప్రధాన పాత్రలను నాగేశ్వరరావు, నాగభూషణం, గుమ్మడి, పద్మనాభం, భారతి, చంద్రకళ, సూర్యకాంతం, మంజుల, పోషిస్తున్నారు.

## ఎన్. టి. ఆర్. గృహప్రవేశం

ప్రముఖ హీరో ఎన్. టి. రామారావుకు హైద్రాబాదులో ఎస్టేటు ఒకటుంది. అధునాతన పద్ధతుల్లో కట్టబడిన 70ఎం.ఎం. థియేటరొకటుంది. ఇప్పుడు ఒక బంగళా కూడా నిర్మించబడింది.

శ్రీ ఎన్. టి. ఆర్. హైద్రాబాదులోని కొత్త యింటిలోకి నవంబరు 21 న గృహప్రవేశం చేసారు. రామన్న శుక్రవారం ఉదయం 5 గంటలకు గృహప్రవేశ ముహూర్తం నిర్ణయించబడినట్టు రామారావుగారే యిటీవల ఎ. వి. ఎం.



"బందిపోటు భీమన్న"లో విజయనిర్మల, కృష్ణ

స్టూడియోలో (చిట్టిచెల్లెలు షూటింగు సందర్భంలో) వెల్లడించారు!

**విడని బంధం**

ఆంధ్ర ప్రేక్షకులకు శ్రీయుతులు ఎన్. టి. రామారావు, గుమ్మడి కలిసి నటించిన చిత్రాలను చూచే అవకాశం గత అయిదేండ్లలో అరుదయింది. వారి అభిమాన ప్రేక్షకులకు ఒక శుభ వార్త. వీరిద్దరు ప్రస్తుతం మురుగన్ బ్రదర్స్ వారి 'చిట్టిచెల్లెలు' చిత్రంలో తండ్రీ (గుమ్మడి), కొడుకు (ఎన్. టి. ఆర్) లుగా నటిస్తున్నారు. వీరిద్దరి అనుబంధం ఈనాటిది కాదని మనందరికీ తెలుసు.

* * *

జానపద దర్శకునిగా పేరుతెక్కిన శ్రీ

## సినిమా

బి. విఠలాచార్యను యిటీవల కలిసాను ఆయన—'మనుషులు మారాలి చిత్రం ప్రజల్లో సంచలనాన్ని కల్గించింది. అంటే ప్రేక్షకుల అభిరుచి మారిందన్నమాటేగా. అందుకే నేను కూడా రెండు సంవత్సరాల వరకు జానపద చిత్రాలను చేపట్టదల్చుకో లేదు. ప్రస్తుతం నేను 'లక్ష్మీ కటాక్షం' 'ఆలీబాబా నలభై దొంగలు' చిత్రాలను డైరెక్టు చేస్తున్నాను. కె.జి.ఆర్. ప్రొడక్షన్స్‌కు ఒక చిత్రం చేసిపెట్టాలి. ఇది గాక తమిళంలో చిత్ర నిర్మాణం చెయ్యాల నుకుంటున్నాను' అన్నారు. 'తెలుగులో ఒక సెంటిమెంట్‌గల కథను ఎన్నుకున్నాను. అలెగ్జాండర్ డూమాస్ రచించిన 'లే మిజరబుల్స్' ఆధారంగా 'బీదలపాట్లు' తీస్తున్నాను. ముఖ్య భూమికలను శ్రీయుతులు ఎస్వీ రంగారావు, నాగయ్య, నాగభూషణం, ఉదయకుమార్ ధరిస్తారు' అని చెప్పారు.

మీకూ శ్రీ ఎన్. టి. రామారావుకు వాదోపవాదం జరిగినట్లు ఒక వార్త పరి



"మామంచి అక్కయ్య"లో కె. ఆర్. విజయ.

శ్రమంతటా వ్యాపించింది, అది నిజమేనా? అని అడిగాను. 'అదంతా శుద్ధ అబద్ధం. ఎవరో కావాలని కల్పిస్తున్న కట్టుకథ. నాపై శ్రీ రామారావుకు ఎనలేని గౌరవం వుంది. వారిపై నాకు గౌరవం, అభిమానం వున్నాయి. ప్రతి సంవత్సరం వారి బ్యానర్‌కు ఒక చిత్రాన్ని డైరెక్టు చేసి

## సినిమా డైరీ

● వికాస్ ప్రొడక్షన్స్ "కన్నులపండుగ" నవంబరు 14న విడుదలయింది. అనిసెట్టి సుబ్బారావు దర్శకత్వం నిర్వహించిన మొదటి చిత్రం యిది.

● "తారాశశాంకము" పౌరాణిక చిత్రం నవంబరు 21 న విడుదలవుతుంది. మానాపురం దర్శకత్వం నెరపిన యీ చిత్రానికి 'ఏ' సర్టిఫికేటు యివ్వబడడం ప్రత్యేక ఆకర్షణ.

● ఏ. వి. ఎం. నిర్మిస్తున్న "చిట్టిచెల్లెలు" షూటింగు వారి స్టూడియోలో నవంబరు 9న ప్రారంభమయింది. ఈ చిత్రంలో శ్రీ రామారావు నాయకుడు.

● అన్నపూర్ణా పిక్చర్స్ అవుట్‌డోర్ పూర్తి చేసుకుని హైదరాబాదు తిరిగివచ్చారు. శ్రీ డి. మధుసూదనరావు నిర్మిస్తున్న యీ చిత్రానికి యోగానంద్ దర్శకుడు.

● నవంబరు 23న 'సిందుహృదయాలు' చిత్రం విజయవాడలో శతదినోత్సవం జరుపు కుంటుంది.



ఇవాళ నగ్నంగా నటించాలి కదా - అందుకని టవల్ చుట్టుకొని వచ్చేశా!
సిన్మాలో ముద్దులెన్నివున్నా నాకేం అభ్యంతరం లేదు... కానీ ముద్దుకి పాతిక వేలు అవుతుంది!
దేవుడోయ్!
ఈ సిన్మాలో ముద్దులున్నాయ్ నువ్వొద్దంటే - నేనే హీరోగా వుంటాను అంటున్నాడండీ డైరెక్టరు!
ముద్దుల అనుమతి
ఇహనుంచి స్టూడియోనుండి వచ్చేప్పుడు మొహం కడుక్కురాక పోతే నా కాళ్ళు మండుతుంది!
రామ రామ... ఇటువంటి సన్నివేశాలను నేను... నేను తీయలేనండీ... ఇంకో కెమెరామన్‌ని ఎవరినైనా పెట్టుకోండి!

పెట్టమని కూడా శ్రీ రామారావు అడిగారు. నేనే వాళ్లకు డబ్బు చాలా అవసరం అని చెప్పేశాను. నాకు శ్రీ రామారావుతో యెలాంటి పేచీ జరుగలేదు. ప్రస్తుతం మార్కెట్టులో జానపదాలకు డిమాండ్ అంతగా వున్నట్టులేదు' అని ముగించారు.

* * *

'పిచ్చి తకుటుంబం' చిత్ర నిర్మాత శ్రీ సుంకవల్లిని కలిసి 'మీ తర్వాతి చిత్రం యెప్పుడు ప్రారంభిస్తున్నారు' అని అడి







## సినిమా

గాను. 'మేము మూడు కథలను తయారు చేస్తున్నాము. శ్రీ రామారావుగారిచ్చే కాల్ షీట్ల కనుగుణ్యంగా షూటింగు ప్రారంభిస్తాం.' 'మూడు కథలను ఒకేసారి తీస్తారా?' అన్నాను. 'సంవత్సరానికి రెండు చిత్రాలను నిర్మించాలని ప్లాను చేస్తున్నాము. మూడింటిలోనూ శ్రీ రామారావు నాయక పాత్రను పోషిస్తారు' అన్నారాయన.

* * *

శ్రీ రాజ్ ఆర్ట్సు ఫిలింస్ ఒక పౌరాణికాన్ని, రెండు సాంఘికాలను తెరకెక్కించ మన్నారు. పౌరాణిక చిత్రానికి నాత్యాక ధాని శ్రీ రామనాధశాస్త్రి రచన చేస్తున్నారు. శ్రీ శాస్త్రి ఒంగోలు కళాశాల ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. పౌరాణికం కలర్‌లో నిర్మించబడగలదని, శ్రీ కమలాకర కామేశ్వరరావు డైరెక్టు చెయ్యగలరని చెప్పారు. సాంఘిక కథను శ్రీ భమిడిపాటి రాధాక్రిష్ణ వ్రాస్తున్నారు. శ్రీ కె. విశ్వనాథ్ డైరెక్టు చేస్తారు అని వెల్లడించారు.

* * *



'అమ్మకోసం'లో క్రిష్ణంరాజు, మాలిని నటి

## మీకు తెలుసా?

లతామంగేష్కర్ ఆమె సోదరుడు హృదయనాథ్ యిపుడు సంగీత దర్శకుడయ్యారు.

సత్యజిత్‌రాయ్ నిర్మించిన చిత్రాలను జర్మనీవాళ్లు కొని తరచుగ టెలివిషన్‌లో ప్రదర్శిస్తారట.

ఆస్ట్రేలియాలోగల సెన్సారుబోర్డు కమిటీలో మహిళల సంఖ్య అధికమట.

మళయాళ నటి షీలా రంగప్రవేశం చేసి ఆరు సంవత్సరాలే అయిందట. కాని ఆమె వంద చిత్రాల్లో నటించేసిందట.

'విందు హృదయాలు' చిత్రాన్ని తమిళంలో, హిందీలో జెమ్ మూవీస్ నిర్మిస్తున్నారు. తమిళంలో వాణిశ్రీ, శివాజీ ముఖ్య పాత్రధారులు. ఒక పాట రికార్డు అయినట్టు, షూటింగు డిసెంబరులో ప్రారంభం కామన్నట్టు హిందీ వెర్షన్‌ను కూడా తనే డైరెక్టు చెయ్యొచ్చని శ్రీ విశ్వనాథ్ వెల్లడించారు. ఎస్. వి. ఎస్ ఫిలింస్‌కు కూడా కథ రెడీ అవుతున్నట్టు శ్రీ ఎన్. టి. ఆర్. కాల్‌షీట్లు ఎప్పుడు యిస్తే అప్పుడు షూటింగు స్టార్టు అవుతుందని చెప్పారు.

* * *

'మనుషులు మారాలి' చిత్రంలో అద్భుతంగా నటించిన శ్రీమతి శారదను తెలుగు నిర్మాతలనేకులు తమ చిత్రాలలో నాయికగా నటించమని కోరుతున్నారు. కాని ఆమె మంచి పాత్రలనే ఎన్నుకుంటున్నట్టు తెలిసింది. అలాగే ఆ చిత్రంలోని నాయక పాత్రధారి శ్రీ శోభన్‌బాబుకు చాలా ఆఫర్లు వస్తున్నాయి. ఆయన కూడా ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొనే పాత్రలనే ఎన్నుకుంటున్నారు. ఈ జంటను ఉషశ్రీ పిక్చర్సు వారు తమ తొలి చిత్రపు నాయికా, నాయకులుగా ఎన్నుకున్నారు.

* * *

ఉషశ్రీ సంస్థ నిర్మించేది సాంఘికం. శ్రీ సుబ్రహ్మణ్యం నిర్వాహకత్వంలో యీ



“పచ్చనిసంసారం”లో వాణిశ్రీ.

చిత్రం షూటింగు డిసెంబరు ఏడవ తేదీన ప్రారంభమౌతుంది. అద్భుత రచనను, ఆశ్వాద్యమ సంగీతాన్ని సమకూర్చే ఈ చిత్రంలోని ప్రధాన పాత్రలను శ్రీయుతులు శోభన్‌బాబు, శారద, రాజబాబు, విజయలలిత, చంద్రమోహన్ పోషించగలరు.

* * *

జగపతి ఆర్టుపిక్చర్స్ 'దసరా బుల్లోడు' సాంఘిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు శ్రీ ఆత్రేయ కథ, మాటలను వ్రాస్తున్న ఈ చిత్రంలో శ్రీ అక్కినేని నాయక పాత్రను పోషిస్తారు. సంగీతాన్ని మహదేవన్ నిర్వహిస్తారు. ఈ చిత్రాన్ని శ్రీ రాజేంద్ర ప్రసాద్ నిర్మిస్తున్నారు షూటింగు ఫిబ్రవరిలో ప్రారంభం అవుతుంది.

* * *

'సత్తెకాలపు సత్తెయ్య' చిత్రం నిర్మాత ప్రసాద్‌కు పేరును — డబ్బును తెచ్చిపెట్టింది. ప్రస్తుతం కథను నిర్ణయించే పట్టులో వున్నారు. తన దగ్గర డజను కథలు వున్నాయని, వాటిలో ఏది మంచిదనిపిస్తుందో దాన్ని జనవరిలో ప్రారంభించగలనని చెప్పారు. తన బ్యానర్‌లో సంవత్సరానికి ఒక చిత్రం విడుదలవుతుందని, తన చిత్రాలలో పెద్ద నటీనటులే నటించగలరని వెల్లడిస్తూ, దర్శకత్వాన్ని తాతినేని రామారావుకు యిద్దామనుకుంటున్నట్లు చెప్పారు.

* * *

ప్రజల్లో ప్రత్యేకాభిమానాన్ని చూరగొన్న ప్రముఖ నిర్మాణసంస్థలయిన ప్రసాద్ ఆర్టు పిక్చర్స్. ఓ. వి. ఎస్. మణిభాషిణిలు కథాన్వేషణలో వున్నారు. ప్రేక్షకుల్లో తమకున్న గౌరవానికి తగ్గట్టు చిత్రం తీయాలనే సంకల్పమే నిర్మాణం ఆలస్యమవుతున్నందుకు కారణం అని తెలుస్తూంది.

* * *



'దొరలా – దొంగలా'లో భారతి, జయశంకర్



కిశోర్ పిక్చర్స్ వారి జానపద చిత్రం తాలూకు పాటల రికార్డింగ్ సందర్భంలో తీసిన ఛాయాచిత్రం. మ్యూజిక్ డైరెక్టర్ శ్రీ బి. గోపాలం, ఎంజినీర్ శ్రీ రామనాథన్, చిత్ర నిర్మాత, రచయిత శ్రీ కనకమేడల, ప్రముఖ నిర్మాత, డిస్ట్రిబ్యూటర్ శ్రీ విశ్వేశ్వరరావ్.



"బంగారు కుటుంబం" రాజ్ బాబు, విజయభాను.

## సినివహా

మాధవి పిక్చర్స్ నిర్మిస్తున్న [illegible]కానికి తాతినేని రామారావు దర్శకుడు. గుహనాథన్ వ్రాసిన కథకు, ముళ్ళపూడి వెంకటరమణ మాటలను వ్రాస్తున్నారు.

* * *

నవశక్తి పిక్చర్స్ నిర్మించనున్న చిత్రానికి సంబంధించిన పాటల రికార్డింగు కార్యక్రమం బొంబాయిలో జరిపించడానికై నిర్మాత శ్రీ గంగాధరరావు, లింగశెట్టిగార్లు వెళ్ళారు. ప్రముఖ హిందీ సంగీత నిర్దేశకులు శంకర్—జైకిషన్లు తెలుగుచిత్రానికి సంగీతం సమకూర్చడం అపూర్వమయిన విషయం. ఈ చిత్రంలో హిందీ, ఇంగ్లీషు పాటలను పాడే శారద కొన్ని పాటలను పాడగలదని తెలుస్తూంది. శ్రీ సి. ఎస్. రావు దర్శకత్వంలో నిర్మితమయ్యే ఈ చిత్రంలో శ్రీ ఎన్. టి. రామారావు కథానాయకుడు.

* * *

నటి జయలలితచే పాడించిన మొదటి వ్యక్తి శ్రీ ఎం. జి. రామచంద్రన్. 'అడిమైపెణ్' చిత్రంలో 'అమ్మా ఎన్రాల్ అన్బు, అప్పా ఎన్రాల్ అరివు' అని పాడింది. తెలుగులో ఆమెచే పాడించిన వ్యక్తి శ్రీ రామబ్రహ్మం మరియు నీలాచార్యగార్లు. 'అలీబాబా నలభైదొంగలు' చిత్రంలో జయలలిత పాడిన పాటను శ్రీ దాశరథి వ్రాసారు. శ్రీ ఘంటసాల సంగీతాన్ని సమకూర్చారు.

'చల్ల చల్లని వెన్నెలాయె
మల్లెపూల పానుపాయె
ఒంటిగా నేనుండజాలరా
నా వన్నెకాడా వయసెవ్వరి పాలుసేతురా'

అలీబాబా (శ్రీ ఎన్. టి. రామారావు)ను గాఢంగా ప్రేమించింది. ఆయన రాకకోసం నిరీక్షిస్తుంది. తన ప్రియుడ్ని తలపోసి పై పాటను పాడింది. ఈ చిత్రానికి డి. వి. నరసరాజా కథకుడు. ముఖ్య పాత్రలను ఎన్. టి. రామారావు, నాగభూషణం, జయలలిత, సత్యనారాయణ, మిక్కిలినేని, సూర్యకాంతం, హేమలత, రమాప్రభ, అల్లు రామలింగయ్య పోషిస్తున్నారు.

* * *

కౌముది అధినేత శ్రీ ఎం. ఎస్. రెడ్డి 'శ్రీ కృష్ణవిజయం' అనే పౌరాణిక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. శ్రీ కృష్ణు

పాత్రను పోషించడానికి శ్రీ ఎన్. టి. రామారావు అంగీకరించారు. కథను నిర్మాతే వ్రాసారు. మాటలను పింగళి నాగేంద్రరావు సమకూర్చే ఈ పౌరాణికాన్ని కమలాకర కామేశ్వరరావు డైరెక్టు చేస్తారు.

* * *

'బుద్ధిమంతుడు' చిత్రాన్ని రాశీ ఫిలింస్ వారు 'కన్నన్ కాటియవయి'గా చేస్తున్నారు. పూజారి మరియు పైలా పచ్చీసుగా శివాజీ గణేశన్ నటిస్తున్నారు. తెలుగులో ముళ్లపూడి నిర్వహించిన శాఖను తమిళంలో బాలమురుగన్ నిర్వహిస్తున్నారు. దర్శకత్వాన్ని మాధవన్ (ఎంగవూరురాజా దర్శకుడు) చేపట్టారు. చిత్రంలోని ప్రధాన పాత్రలను ఎస్వీరంగారావు, నాగేష్, కె. ఆర్. విజయ పోషిస్తున్నారు. తమిళ చిత్రానికికూడా కె. వి. మహాదేవన్ సంగీత నిర్దేశకుడు.

* * *

డిసెంబరులో ప్రపంచ చలన చిత్రోత్సవం మనదేశంలో జరుగబోతూంది.

* * *

హీరో కృష్ణ స్థాపించిన చిత్రనిర్మాణ సంస్థకు శ్రీ పద్మాలయ అని పేరు. ఈ సంస్థకు జి. ఆదిశేషగిరిరావు అధినేత. వరప్రసాదరావు నిర్దేశకుడు. బయటి చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించడాన్ని మానుకున్న శ్రీ ఆదినారాయణరావు కృష్ణపైగల ప్రత్యేకాభిమానం కొద్దీ 'అగ్నిపరీక్ష'కు సంగీతాన్ని సమకూర్చేందుకు సమ్మతించారు. నాయికా నాయకులుగా విజయనిర్మల, కృష్ణ నటిస్తారు. తనతోటి 'తేనెమనసులు'లో నాయకుడిగా నటించిన రామ్మోహన్‌కు తన చిత్రంలో ఒక ముఖ్యభూమిక నివ్వడం కృష్ణ విశాల హృదయానికి నిదర్శనం. ఈ చిత్రానికి ఛాయను స్వామి, కళను తోట, నృత్యాన్ని హీరాలాల్ అండ్ చిన్ని సంపత్ నిర్వహించగలరని తెలుస్తూంది. చిత్రంలోని ముఖ్య భూమికలను గుమ్మడి, నాగభూషణం, రాజబాబు, బాలకృష్ణ, సాక్షి రంగారావు, రాధాకుమారి, జ్యోతిలక్ష్మి, కె.వి.చలం, ముక్కామల, ఛాయాదేవి ధరించగలరని తెలుస్తూంది. జనవరినుండి మార్చివరకు షూటింగు వుండగలదని, ఈ చిత్రం నవయుగావారి విడుదల కాగలదని తెలుస్తూంది.

* * *



'మళ్లీ పెళ్లి'లో అనిత, విజయనిర్మల

నటి శారద నటనా ప్రతిభను చూడగల మరొక చిత్రమే హాస్యనటుడు చలం సమర్పించే 'సంబరాల రాంబాబు' ఇందులో ఆమె ఒక విచిత్రమయిన పాత్రను పోషించింది. జి. వి. ఆర్. శేషగిరిరావు దర్శకత్వాన్ని నెరపిన ఈ చిత్రంలో నాయక పాత్రను చలం, యితర భూమికలను రంగారావు, గుమ్మడి, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, ధూళిపాళ, రేలంగి, మిక్కిలినేని గీతాంజలి, సూర్యకాంతం, హేమలత, రాధాకుమారి, మనోరమ ధరించారు. రచన రాజశ్రీ, సంగీతం కుమార్ నిర్వహించిన ఈ చిత్రానికి టి. మోహనరావు నిర్మాత.

—శ్రీనివాస్

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA

